Regd. No. H.N.L. 18

29-1-1993 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 64 సంచిక :5 విడిప్రతి : రు. 2.00 లు

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



అరణ్యాలు వదలి జనారణ్యాలలో తిష్టవేస్తున్నారు నక్సలైట్లు!

# ఈ సవాల్‌ను ఎదుర్కోగలదా ప్రభుత్వం?

ప్రఖ్యాతుడైన పోలీసు అధికారి శ్రీ వ్యాస్ దారుణహత్య ఇటు రాజకీయ వర్గాలలో, అటు పోలీసు శిబిరాలలో భయ ప్రకంపనలు వ్యాపింపజేసింది. వ్యాస్ ప్రజాభిమానం పొందిన అధికారి. రౌడీమూకల విశృంఖలత్వంతో అరాచక మయంగా వుండిన విజయవాడ నగరాన్ని ప్రక్షాళన చేసిన సమర్థుడు. నిజాయితీకి, నిర్భీతికి, అసమాన ధైర్యసాహసాలకు పెట్టింది పేరు. ఎన్‌టిఆర్ హయాంలో నక్సల్స్ అణచివేతకు 'గ్రేహౌండ్స్' దళాన్ని ఏర్పరచి, ఎందరో కిరాతక తీవ్రవాదులను మట్టుబెట్టిన ఘనత ఆయనదే. అటువంటి అధికారిని, హైదరాబాదు మహానగరంలో, పోలీసు ప్రధాన కార్యాలయానికి కూతవేటు దూరంలో, పబ్లిక్‌గా, పదిమంది చూస్తుండగా, సాటి అధికారి సమక్షంలో, గన్‌మెన్ సాక్షీభూతుడుగా నిల్చి వున్నప్పుడే కిరాతకంగా చంపి, ఒళ్లంతా తూటాలతో తూట్లు పొడిచి, నింపాదిగా నడుచుకుంటూ వెళ్లి, మాయం కాగల్గారంటే ఎవరికైనా ఒంట్లో వణుకు పుట్టడం సహజం. స్వతహాగా సాహసులు, నేర్పరులు అయిన పోలీసు అధికారులకే, రాజధాని నగరంలోనే రక్షణ లేనప్పుడు ఇక ఎవరికి మాత్రం భద్రత వుంటుంది? పరమ కిరాతకుడుగా పేరుగాంచిన నక్సలైట్ నాయకుడు శంకర్‌ను హతమార్చామన్న సంతోషం, పోలీసులలో ఒక్క ఘడియకూడా నిలవకుండా చేసింది దుర్ఘటన. ఆ ఎన్‌కౌంటర్ కు ఈ హత్య ప్రతీకారమన్నమాట అవాస్తవం. ఇది అప్పటికప్పుడు అనుకుని చేసిన ఘాతుకం కాదు. ఎన్నో రోజుల నుంచి పథకం వేసి, పరిస్థితులు గమనించి, పొంచి వుండి, ఏర్పాట్లన్నీ లోపం లేకుండా పూర్తిచేసుకుని నెరవేర్చిన రాక్షసకృత్యం. హైదరాబాదు సిటీలో, ఒక సీనియర్ పోలీసు అధికారిని తీవ్రవాదులు నీడలా వెన్నంటి తిరుగుతుంటే పసిగట్ట లేక పోయిన గూఢచారి విభాగం సమర్థతను శంకించవలసి వుంటుంది.

గత రెండు మూడు నెలలుగా జరుగుతున్న సంఘటనలు పరిశీలిస్తే పీపుల్స్‌వార్‌పై ప్రభుత్వం విధించిన నిషేధం వారి కార్యకలాపాలను ఏమాత్రం నిరోధించ లేక పోతున్నదని అర్థమౌతుంది. వచ్చిన ఒకే ఒక మార్పు- నక్సలైట్లు అరణ్యాలు వదలి, జనారణ్యాల వంటి నగరాలలో మకాం పెట్టడం. వ్యాస్ హత్య, శంకర్ ఎన్‌కౌంటర్, వరంగల్ నక్సల్‌నాయకుని దావు వంటి సంఘటనలు వారు నగరాలు, పట్టణాలలో నివాసాలేర్పరుచుకున్నారన్న వాస్తవాన్ని ధృవ పరుస్తున్నాయి. తీవ్రవాదాన్ని ఆదరించి, సహకరించే స్థాయికి మన నగర ప్రజలు చేరుకోక పోయినా, అసాధారణ ప్రతిభా పాటవాలు కల్గిన ఈ తీవ్రవాద నాయకులు సిటీలలో గోళ్లు గిల్లుకుంటూ కాలక్షేపం చేస్తారని మాత్రంభావించలేము. తమ పరిసరాలలో తమ భావాల వ్యాప్తికి వారు నిరంతరం యత్నిస్తూనే వుంటారు. పైగా అడవులలో కంటే నగరాలలో హింసాకృత్యాలు జరపడం సులువు. గెరిల్లా పోరాట శైలిని జీర్ణించుకున్న నక్సలైట్లు- క్షణమాత్రంలో తమ లక్ష్యాన్ని సంహరించి మాయమైపోగల యుక్తి పరులు. వారి వద్ద అపారంగా ధనరాశు లున్నాయి. ఆధునిక ఆయుధా లున్నాయి. ఇంతటి విధ్వంసక శక్తి జనం మధ్యలో మకాం పెడితే- జరగనున్న బీభత్సాన్ని ప్రభుత్వం ఎదుర్కోగలదా అన్నదే ప్రశ్న. ఇదేమీ చిన్న సవాల్‌కాదు. కాగితాల పైన నిషేధప్రకటన చేసినంత మాత్రాన అంతరించిపోయే అవకతవక సంస్థలు కావవి. సిద్ధాంత పోరాటం నుంచి వ్యక్తిహింస స్థాయికి, అక్కడి నుంచి, విచక్షణ లేని విధ్వంస కాండ స్థాయికి పతనమైపోయిన తీవ్రవాద సంస్థలను అదుపుచేయ లేకుంటే జన జీవితం ఛిన్నాభిన్నమౌతుంది.

దీన్నొక ప్రతిష్టా సమస్యగా తీసుకుని పోరాడాలంటే ప్రభుత్వానికి చిత్తశుద్ధి, పోలీసు శాఖకు స్థిరమైన లక్ష్యం కావాలి. కాని విజయభాస్కరరెడ్డి

కారవ 7 పేజీలో

# పివి "సన్‌స్నేషో"

రాజధాని పర్యటనలో ప్రధాన మంత్రి పుత్రుల షో కొట్టొచ్చినట్లు కనిపించింది. ప్రధాని పాల్గొన్న వివిధ కార్యక్రమాల్లో రాష్ట్ర మంత్రి పి.వి. రంగారావు పిసిసి ప్రధాన కార్యదర్శి పివి రాజేశ్వరరావు కుడి ఎడమలుగా పివిని అనుసరించటం చూసే వారికి ఎబ్బెట్టుగా అన్పించింది. ఎమ్మెల్యేలు, ఎంపీలు, పిసిసి, ఏఐసిసి సభ్యులు పాల్గొన్న సమావేశంలో వేదికపై పివికి ఎడమవైపున రంగారావు, కుడివైపు రాజేశ్వరరావు ఆసీనులయ్యారు. పార్టీలో మహా మహులు హాజరై, క్రింద కూర్చున్న ఈ సమావేశంలో పివి పుత్రులకు పెద్దపీట వేసి వేదిక మీద కూర్చోబెట్టడం విమర్శలకు దారితీసింది. అలాగే బహిరంగ సభలో కూడా పిలవక పోయినా పివి రంగారావు వేదిక ఎక్కి నిర్వాహకుల్ని ఇబ్బంది పెట్టారు. వేదిక

## రాజధాని రాజకీయం

దిగాల్సిందిగా నిర్వాహకులు ఎంతగా మొత్తుకున్నా రంగారావు మాత్రం లక్ష్య పెట్టకుండా సభముగిసే వరకు వేదిక పైనే వుండి "షో" చేశారు. ప్రధానికి స్వాగతం చెప్పేందుకు స్కూలు పిల్లల్ని రోడ్డుకి ఇరువైపులా నిల్చోబెట్టించిన రంగారావు బహిరంగ సభలో కూడా బలవంతంగా స్కూలు పిల్లల్ని కూర్చోబెట్టి, విద్యాశాఖా మంత్రిగా తన " సత్తా" ఏమిటో తండ్రికి చూపించారు!

### అర్జున్‌తో దోస్తీ

కేంద్రంలో పి.వి.కి వ్యతిరేకంగా గ్రూపుకడుతున్న అర్జున్‌సింగ్‌తో దోస్తీ చేయాలని వై.ఎస్ నిర్ణయించారని తెలుస్తోంది. కేంద్రమంత్రి వర్గవిస్తరణలో పివి ఏదో ఒరగబెట్టారని అన్నాళ్లూ తెరవెనుక వున్న వైఎస్ ఇక

కొరవ 8 పేజీలో

## పినాకిని తీరం

### 'ఎర్ బస్' వద్దండి!

జిల్లా కాంగ్రెస్ కార్యవర్గ అధికార జాబితా ఇంకా తుది రూపం పొందినట్లు లేదు. దానికి వంట మనిషి ఒక్కరైతే ఆ బ్రహ్మాండమైన పనికి ఇంత శ్రమ, ఇంత విలంబనం అవసరం లేదు. వంట వాళ్లు ఎక్కువ మంది అయ్యారు. అందువల్ల ఆలస్యం కావడమే కాదు, వంటకం కూడా మ్రింగుడు పడనంత నాశిరకంగా తయారవుతుంది. ఇదీ అసలు రహస్యం.

దీని కోసం ఎదురు చూడాల్సిన అవసరం లేదు. అందులో ఏముంది గనుక ఆతురతగా ఎదురు చూడడానికి చదవడానికి కష్టమైనంత పాడవుది కావడమే కాదు, జ్ఞాపకం పెట్టుకోవడానికి మాత్రం ఏ ఏకసంథాగ్రాహులకో తప్ప ఇంకెవరికి వీలు పడుతుంది? అన్నిటికీ మించి ప్రకటించిన రోజు తప్ప తర్వాత దాంతో పనేముంది? దానికి విలువేముంది? చెత్త బుట్టలో పారేసే పనికిరానికాగితం ఎంతో ఇదీ అంతే గదా! దానికెందుకో ఈ కోటాలు, ఆరాటము, పోటీ, తక్కుంగల వ్యర్థ ప్రయాసలు! నవ్వు వస్తుంది!!

నవ్వు రానీ, ఏడ్పు రానీ జరిగేదేదో జరిగి పోతుంది. పులుసు పోశ మనం వాగుకోవడం తప్ప దాని వల్ల ప్రయోజనమేమీ వుండదు. పూర్వం జి.కాం. వర్కింగ్ కమిటీ అంటే ఒక ప్రెసిడెంటు, ఒకరో ఇద్దరో ఉపాధ్యక్షులు, ఒక ప్రధాన కార్యదర్శి, ఇద్దరు సంయుక్త కార్యదర్శులు, ఒక ట్రెజరరు, పది పదకొండు మంది కార్యవర్గ సభ్యులు వుండే వారు. అవసరమైన పుడంతా సమావేశమై, ముఖ్య విషయాల మీద చర్చించి, తీర్మానాలు చేసేవారు. ఆ కార్యవర్గానికి ఒక ప్రతిష్ఠ వుండేది, విలువ వుండేది, గౌరవం వుండేది - కాంగ్రెస్ వాదులలో, ప్రజలలో కూడా! ఇప్పుడు సమావేశాలు లేదు, తీర్మానాలు లేదు, గాడిద గుడ్డూ లేదు. అన్నీ ఒక వ్యక్తి జేబులో వుంటాయి. ఆయనే ప్రెసిడెంటు, ఆయనే కార్యదర్శి, ఆయనే కార్యవర్గము, ఆయనే తీర్మానము, ఆయనే అన్నీను! అటువంటప్పుడు నామ్ కే వాస్తే కైనా జి.కాం. కార్యవర్గాన్ని ఎర్ బస్ చేయడమెందుకు నగు బాట్లు కావడమెందుకు? జనార్దన రెడ్డి గారు కూడా కొత్తదనాన్ని ప్రవేశ పెట్టలేకున్నారు; దురదృష్టమే!

### మునిసిపాలిటీకి

### అభ్యర్థి వున్నాడా?

జిల్లా కేంద్రమైన నెల్లూరు టవున్ విషయంలో జనార్ధన రెడ్డి గారు ఇంత వుదాసీనం వహిస్తున్నారు ఎందువల్లో అని పలుమార్లు అనిపిస్తుంటుంది. అనేక సార్లు ఈ శీర్షికలోనే ఆ విషయాన్ని ప్రస్తావించాను; ఆయనలో స్పందనే లేదు. ఇద్దరు ఎం.పి.లు, ఐదారు మంది శాసనసభ్యులు నెల్లూరులో కాపురమున్నా వారి దృష్టి, ఆసక్తి వారి వారి నియోజక వర్గాల మీద వుంటుంది గాని, నెల్లూరు మీద వుండదు. నెల్లూరు టవున్ శాసనసభ్యుడున్నాడు; ఆయన రాబోయే మునిసిపల్ ఎన్నికల విషయమై ఆలోచిస్తూ వుండాలి, బహుశా ప్రాథమిక ప్రయత్నాలు ప్రారంభించి కూడా వుండాలి. ఆయన ఏ బంధాలు లేని వాడు; ఏ మార్గాన్నైనా అనుసరించవచ్చు; ఏ దారైనా తొక్కవచ్చు; చేసి చూద్దాం అనే వైఖరిలో వుండవచ్చు. ఒక శాసనసభ్యుడు మాత్రం మొన్న నెల్లూరు విషయం ఎవ్వరూ పట్టించు కోవడం లేదని తన ఆందోళన, ఆవేదన వెలిబుచ్చాడు.

మునిసిపల్ ఎన్నికలు మంత్రి శ్రీ నరసింహారెడ్డి ప్రకటిస్తున్న ప్రకారం మే నెలలో రావడమంటూ సంభవిస్తే కాంగ్రెస్‌కు సంబంధించినంత వరకు అన్నీ అనుకూలాలే. రాజకీయ

కొరవ 8 పేజీలో

## జమీన్‌రైతు
### రిపబ్లిక్ డే

44 వ రిపబ్లిక్ దినోత్సవాలు ఘనంగా ముగిశాయి. దేశం ఇప్పుడున్న పరిస్థితులలో ఈ మాత్రం ప్రశాంతంగా గణతంత్ర దినోత్సవం జరుపుకోగల్గడం గొప్పే. నెల క్రితం అయోధ్య అల్లర్ల ఫలితంగా ఏర్పడిన అల్లకల్లోల వాతావరణం చూసిన వారికి భారత దేశం అరాచకం పాలుకాకుండా కాపాడడం ఎవరి తరమూ కాదన్పించింది. కాని ఎవరి ప్రమేయమూ లేకుండానే పరిస్థితులు కుదుట బడ్డాయి; ప్రశాంతత నెలకొన్నది. భారతీయ జీవన విధానంలోనే ఏదో తెలియని దివ్యశక్తి దాగివుండాలి. ఎన్ని ఆటుపోట్లు ఎదురైనా, తుఫాన్లు సుడిగుండాలలో ఎక్కినా దానంతట అదిగా నిలదొక్కుకుని నిరంతరాయంగా సాగిపోయే విలక్షణ శక్తి దానికి వుండివుండాలి. తూర్పు ఐరోపా దేశాలలో, రష్యాలో ఇటీవల జరుగుతున్న అంతర్యుద్ధాలు, దేశాలకు దేశాలే ముక్కచెక్కలయ్యే పరిణామాలతో పోలిస్తే - భారతీయ సంస్కృతి వైశిష్ట్యం అర్థమౌతుంది. దేశాన్ని విచ్ఛిన్నం చేయాలనే కుత్సితంతో విద్రోహులు పన్నే పన్నాగాలను ప్రతిఘటించే స్థైర్యం, నిలదొక్కుకోగల్గిన నిగ్రహం భరతమాత అణువణువునా వున్నాయని ఈ పరిణామాలు సూచిస్తున్నాయి. అఖండ భారతావని ఉజ్వల భవిష్యత్ పట్ల నెలకొంటున్న అనుమానాలను పటాపంచలు చేస్తున్నాయి.

అయోధ్య వుద్యమం నుంచే కాదు- విదేశీ శక్తుల విషపు నీడ నుంచి సైతం దేశం సురక్షితంగా బయటపడిందన్న సంతోషం ఈ రిపబ్లిక్ దినోత్సవంనాడు కలుగుతున్నది. పంజాబ్‌లో పునఃప్రతిష్ఠితమైన ప్రజాస్వామ్య వ్యవస్థ ప్రకాశవంతమైన వెలుగు సైతం ఈ గణతంత్ర దినం రోజు ప్రతి భారతీయుడికీ గర్వకారణమే. విదేశీ విష సర్పాల వత్తాసుతో, తుపాకి తూటాల వర్షం కురిపించి, బీభత్సం సృష్టించిన తీవ్రవాదుల పట్ల పంజాబ్ ప్రజలు తమ నిరసన, విముఖభావం ప్రకటించిన సందర్భం ఇది. వేలాది గ్రామ పంచాయితీలకు ప్రశాంతంగా, నెత్తురు చిందకుండా ఎన్నికలు జరిగాయక్కడ. బియాంత్ సింగ్ ప్రభుత్వం జాతి గర్వించే రీతిలో ప్రజాస్వామ్య ప్రక్రియను పునఃప్రారంభించింది. తీవ్ర వాదులకు ప్రజలలో ఏమాత్రం ఆదరణ లేదని ప్రపంచానికి చాటి చెప్పింది.

ఈ రెండు విజయాలు కల్గించిన ఆత్మవిశ్వాసంతో మనం ఇప్పుడు దేశమెదుర్కొంటున్న సమస్యలను పరిష్కరించుకోవలసి వుంది. అయోధ్య అల్లర్లు ఆగినా, ఆ విషాద ఘట్టం చేసిన గాయం ఇంకా జనం మనసులపై వుండు లాగానేవుంది తప్ప, మానలేదు. రిపబ్లిక్ దినోత్సవం రోజే ఢిల్లీ, బొంబాయి నగరాలలో పునః ప్రారంభమైన మతకల్లోలాలు ఆ నిజాన్ని రుజువు చేస్తున్నాయి. ఇంత విధ్వంసం జరిగిన తర్వాత కూడా ఇటు బిజెపి, అటు బాబ్రి మసీదు కమిటీ నాయకుల వక్రబుద్ధి మారడం లేదు. అధికార దాహంతో తాము చేసే ప్రసంగాలు, పన్నాగాల వల్లనే నెత్తుటి ఏరులు ప్రవహిస్తున్నాయన్న నిజం తెలిసీ వారు ఆ దానవత్వపు పోకడలు వీడడం లేదు. మత విద్వేషాగ్నిని రగిలించడం మానడం లేదు. దేశం కంటె, ప్రజలకంటె, మానవత్వం కంటే తమ పదవులు, అధికారం ఎక్కువగా భావించే ఇటువంటి కుళ్లు బుద్ధి కల్గిన పార్టీలను, నాయకులను సంఘ బహిష్కారం చేస్తేనే దేశానికి భవిష్యత్తు.

### పాణ్యం ఎన్నిక

ఏ మాత్రం తొణుకు, తొట్రుపాటు లేకుండా రాజకీయ చిక్కుముడులు విప్పడంలో ప్రధాని పివి చాణుక్యుడికి సరిజోడి! విజయభాస్కరరెడ్డి పదవికి ముప్పు ఏర్పడి, పెద్ద రాజ్యాంగ వివాదంగా మారబోయిన పాణ్యం ఉప ఎన్నికకు చిటికెలో పరిష్కారం కనిపెట్టేశాడు. తిక్కమనిషిగా పేరుపొందిన ఎన్నికల కమీషనర్ శ్రీ టిఎన్ శేషన్‌ను మాయచేసి, ససేమిరా అని భీష్మించుకున్న ఆయన చేతనే ఏప్రెల్ 7 తేదిలోగా ఎన్నిక జరిపిస్తున్నట్లు ప్రకటింపజేశాడు. విజయభాస్కరరెడ్డి పదవి స్వీకరించి ఏప్రెల్ 9తేదితో ఆరుమాసాల గడువు తీరుతుంది. అందువల్ల ఆయన పదవికి వచ్చిన ముప్పు తప్పింది.

ఎన్నికైతే జరిగిపోతున్నదికాని, ఒక వ్యక్తి ప్రయోజనం కోసం ఎన్నికల విధానాలు, నిబంధనలు మార్పు చేయడం సమంజసమా అన్న శేషన్ ప్రశ్నకు మాత్రం సమాధానం రాలేదు. అది ఎప్పటికీ శేష ప్రశ్నే. విజయభాస్కరరెడ్డి గారు ఇప్పటికే ఈ విషయంలో అజాగ్రత్తగా వ్యవహరించి తప్పుచేశారు. రేపు పోలింగ్‌లో కూడా ఆయన పాణ్యంను మరొక నంద్యాలగా మార్చనున్నారన్న వార్తలు విన్పిస్తున్నాయి. రిగ్గింగ్ కోసమే ఆ నియోజక వర్గం ఎంపిక చేశారని బాహటంగానే మాట్లాడ్తున్నారు. గెలుపు ఎటూ నిశ్చితం కాబట్టి, కనీసపాటి ప్రజాస్వామ్య సూత్రాలైనా పాటించి పోలింగు జరపగల్గితే ఆయనకు ప్రతిష్ఠ; లేకుంటే గెల్చినా అప్రతిష్ఠే

## జమీన్‌రైతు

29-1-1943

### స్వాతంత్ర్యదినోత్సవం అరెస్టులు

నెల్లూరు విఆర్ కాలేజిలో ప్రిన్సిపాల్ పవిత్రమైన విదేశీ వస్త్రాలతో జాతీయ పతాకను ప్రతిష్టిస్తే యం.ఏ గుర్రం సుబ్బరామయ్య గారు ఖద్దరు ధారణలో వుపన్యసించారు. విద్యార్థులేమో సమ్మెచేసి యిండ్లకు వెళ్లారు. ట్రంకురోడ్డు మీద హోటళ్లు, దుకాణాలు మూసి వేసి హర్తాలు చేసిరి.

వెంకటగిరిలో కాంగ్రెస్‌వారు బండా చౌకు వద్ద జాతీయ పతాకాన్ని నెలకొల్పిరి. పోలీసు దాన్ని లాగి పెరికి పారవేయబోగా పొట్టి ముత్యాలుగారి సుబ్బరామయ్య, వంట శంకరదాసు గార్లు అడ్డగించగా పోలీసు బలవంతంగా పీకి వేసి వారిద్దరిని అరెస్టుచేసారు. తరువాత పతాక రక్షణలో ఒక్కొక్కరుగా 8 మంది అరెస్టు గావింపబడ్డారు. అందులో 5 ఫారం విద్యార్థి పి.వి.చలమయ్య, పొట్టి ముత్యాలు గారి జగ్గయ్యలను మరురోజు వదిలిరి. కావేటి రామతిలకమ్మను అరెస్టుచేసి, స్వంతపూచిమీద వదిలిరి. వీళ్ల గుర్నాథం గారి 12 ఏళ్ల కుమార్తెను కూడా అరెస్టుచేసి అప్పుడే వదిలిరి. కమ్యూనిస్టులు వుత్సవంలోని కాంగ్రెస్ జాతీయ పతాకాలను, ఎర్రజెండాలను పోలీస్ పీక్కొని రామనాథం వగైరాలను అరెస్టు చేసి వదిలిరి.

26 తేది కావలిలో హర్తాలు జరిగింది. హిందీ అధ్యాపకులు నరహరిగారు, సయ్యద్ ఖాసిం, లెక్కల తిమ్మారెడ్డి, తన్నీరు కొండయ్య గారలు బజారులో స్వాతంత్ర్య ప్రమాణ పత్రం చదువుతున్నపుడు వారిని అరెస్టుచేసి రాత్రి 8 గంటలకు వదిలిరి. 27 తేది పై నలుగురు తాలూకా ఆఫీసుకు పోయి వుద్యోగులను రాజీనామా పెట్టమని కరపత్రములు పంచిపెట్టగా వారిని అరెస్టు చేసి సాయంత్రం వదిలిరి.

### 50 ఏళ్ళ క్రితం ఈ వారం

### నెల్లూరు ముచ్చట్లు

అల్లూరు నుండి 5 వేలు యుద్ధనిధికి వసూలు కరిగించి తెస్తే నెల్లూరు పరాబోకాయన వాండ్లను మోసగించి 1750 తులాల వెండిని తొట్టేసినాడు అని ఒక చేవ్రాలులేని జాబువచ్చింది. చేవ్రాలు లేనందువల్ల అట్టి విషయాన్ని ప్రకటించడానికి వీల్లేదు. ఆజాబు వ్రాసినవారు పోలీసు లకైనా ఆచూకియిస్తే బాగుంటుంది.

* * *

వార్తమోషూరు తాలూకా విషయంలో సర్కిల్ యధార్థాన్ని తెలుకోలేదా, తెలుసుకో నిచ్చగింపలేదా, తెలుసుకొను వేళగాలేదా? పార్టీలిట్లున్నా పాపం! పేదవారు ఆ సాహెబ్ పొగొట్టుకున్న ఆస్తినెవరిస్తారు?

ఈ మధ్య గూడూరు తాలూకా తూర్పు కనుపూరు, కొమరావారిపాళెం,చింతవరం, ఆర్లపల్లి గ్రామాల్లో లూటీలు జరిగినవనీ, ఆ సందర్భంలో ఏరూరు హరిజనులను వందమందిదాకా అరెస్టుచేశారనీ, ఏసు క్రీస్తుతో చెప్పి మిమ్మలను వదిలి పెట్టిస్తామని క్రీస్తుమతమేమో వారికి వెళ్ళి చెపుతున్నదనీ ఆ కారణంగా హరిజనులంతా జుట్లుతీసివేసికొని బోడి గుండ్లు చేయించుకుంటూ ఆ హడావిడిలో నిమగ్నులై యున్నారనీ, వరగలి ప్రాంత న్యూస్ గజిట్‌వార్త. మిస్టర్! లూథర్ గారు, ఈ గందర గోళమేమిటో మీరేమైనా వింటె చెప్పండి?

* * *

మాజీ ప్రెసిడెంటు వంగల్లు కోదండరామిరెడ్డి గారు పెనుబోలు సుబ్బయ్య కేసులో డిఫెన్సు సాక్షిగా సెషన్సు కోర్టుకు రావలసియున్నది. కాని 26,27 తేదుల్లో రాలేదు. జడ్జిగారు తిరుగా బళ్లారి జైలుకు టెలిగ్రాం యిచ్చారనీ, ఈ దినం 29 తేది విధిగా వస్తారని ఎదురుజూస్తున్నారు.

—విమర్శకుడు

కొరవ 8 పేజీలో

## రైతులు రెండవ తరగతి పౌరులా?

భారత దేశంలో రైతుల పరిస్థితి నానాటికీ దిగజారి పోతూంది. లేకుంటే కంప్యూటర్ యుగంలో కూడా రైతులు పూర్వపు జానపద చిత్రాల్లో మాదిరి సకాలంలో సరఫరా కాని కరెంటు మూలంగా రాత్రిపూట వ్యవసాయం చేయవలసిన దుస్థితి దాపురించింది. ప్రస్తుతం రైతుల కంటె వెట్టిచాకిరి చేసేవాళ్లే మేలనిపిస్తుంది. ఎక్కడో ఆఫ్రికాలో వున్న నీగ్రోలమీద వుండే సానుభూతి మనదేశంలోని రైతులపై ప్రభుత్వానికి లేకపోవడం దారుణం కాక మరేమిటి? రైతులకు ఎంత నోరు లేక పోయినా రాత్రి పూట వ్యవసాయం చేయడం మంచిదని రాష్ట్ర వ్యవసాయ శాఖ విద్యుత్ బోర్డుకు సూచించిందా? వుదయం 11 గంటల నుండి రాత్రి 10 గంటల వరకు 2 ఫేసుల్లోనే విద్యుత్ సరఫరా చేస్తారు. నిద్రపట్టే సమయాల్లో దాన్నిమాని చెట్లు, పుట్లమ్మట సాగి, నీరు పారే వరకు శివరాత్రి జాగరణలు చేయడం రైతులకు తప్పడం లేదు. తన రక్తాన్ని స్వేదంగా మలచి దేశప్రజల కడుపులు సకాలానికి నింపుతున్న రైతులు ప్రభుత్వానికి రెండవతరగతి పౌరులుగా కనపడుతున్నారా? రైతే వెన్నెముక అన్న సామెత ఎప్పుడో తుంగలో తొక్కేసి పరిశ్రమలకు సకాలంలో విద్యుత్ సరఫరా చేస్తున్న మీ తీరును ఏమని విమర్శించగలము? రాత్రిపూట వ్యవసాయం చేసే దుస్థితి దాపురించినా ఒక్క మాటైనా మాట్లాడని మన రైతు కుటుంబాలనుండి వచ్చిన ఎమ్మెల్యేలను వ్యవసాయ సంఘాల పనితనాన్ని ఏమని వర్ణించగలము? ఎరువుల ధరలు పెరిగిపోయి కృంగిపోయిన రైతుల పాలిట విద్యుత్ కోత శాపమైంది. పాలకులారా! మా మొర ఆలకించి పరిస్థితి చక్కదిద్దండి.

\- ఒక రైతు.

### జనవాణి

### ఈ సూచనలు బాగుంటాయ్ అనుకుంటా!

ఫిబ్రవరి 15 తేది నెల్లూరులో జరిగే ట్రాఫిక్ సలహా సంఘం సమావేశం ఈ క్రింది ప్రతిపాదనలు పరిశీలించమని మనవి. టౌన్‌లోని ముఖ్యమైన రోడ్లకు ట్రాఫిక్ డివైడర్లు ఏర్పాటుచేయాలి. ట్రాఫిక్ సిగ్నల్స్ రిపేరుచేసి, టౌన్‌బస్సుల స్పీడు తగ్గించాలి. ట్రాఫిక్‌కి అడ్డంగా తయారైవున్న ఆటోస్టాండులను ప్రక్క స్థానాలకు తరలించడంతోపాటు వీటికి కార్లకు మీటరు ఛార్జి పెట్టాలి. వాహన చోదకులు తప్పుచేసిన సమయంలో చెల్లించే జరిమానాకు రశీదు తక్షణమే ఇవ్వాలి. ముఖ్యమైన కూడలన్నింటిలో 24 గంటలు ట్రాఫిక్ పోలీసులను ఏర్పాటు చేయాలి. విద్యాసంస్థలలో ముఖ్యంగా ట్రాఫిక్ నియమనిబంధనలు తెలియజేస్తూ ట్రాఫిక్ పోలీసులు, రవాణా శాఖాధికారులు టౌన్ ప్రజలకు కొన్ని క్లాసులు నిర్వహిస్తే బాగుంటుంది.

-వామ్మిన సుబ్రహ్మణ్యం

నెల్లూరు.

### అన్-ఎయిడెడ్ సర్వీసురద్దు- అన్యాయం!

అన్‌ఎయిడెడ్ కాలేజిలు అన్నవి ఒక్క ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే ఇంకా మిగిలివున్న శిధిల సంప్రదాయం. ఇతర రాష్ట్రాలలో ప్రత్యేకించి తమిళనాడులో ఒక కాలేజికి పర్మిషన్ ఇచ్చిన వెంటనే

కొరవ 7 పేజీలో

# పబ్లిక్ వీధులే దిగమ్రింగేశారు!

నెల్లూరు మునిసిపాలిటీ ఎంత దిక్కు దివాణం లేనిదై పోయిందో, వగల్పాటిదై పోయిందో, దార్భాగ్య స్థితిలో వుందో, గుడ్డి దివాణమై పోయిందో, అమ్మ అబ్బలేని అనాధ అయిపోయిందో, అబంధనై పోయిందో, ముఖ్యమైన బాధ్యతలను కూడా నిర్వర్తించలేకుండా విఫలమైపోయిందో ఒక చిన్న ప్రత్యేక సాదృశ్యాన్ని వివరిస్తే తెలుస్తుంది.

నెల్లూరులో పార్కులకు ఎంతో స్థలాన్ని వదలిపెట్టి వున్నారు. పెద్ద పెద్ద విస్తీర్ణాలు, అందమైన ప్రహరీ గోడలు, గ్రిల్సు, గేట్లు తదితర హంగులన్నీ వున్నాయి. కొన్నిట్లో అసలు చెట్లు లేవు; వున్న చెట్లు వాటి మొహాన నీళ్లు పోసే వారు లేక ఎండి పోవడమో, లేక అడవులై పోవడమో జరుగుతున్నది. గార్డనర్లు లేక కాదు —నెలనెలా జీతాలుతీసుకోవడానికి నిక్షేపంగా వున్నారు! కాని వారు పార్కుల నిర్వహణకు వినియోగించబడటం లేదు. వారి చేత ఇతర పనులు చేయించు కుంటున్నారో, లేక హాజరేసుకొని వారు తమ స్వంత పనులు చేసుకుంటున్నారో తెలియదు. ఎకరా, రెండెకరాల విస్తీర్ణం మొదలు, చిన్న సైజు పార్కుల వరకు గోడలు, గేట్లు పెట్టేశారంటే ఎవరో అభిమాన కంట్రాక్టర్ల జేబులు నింపడానికి చేసిన పనిగా వున్నట్లుంది గాని, పౌరుల కోసం కాదు!

పార్కులంటే గుర్తుకొస్తున్నది. 1976లో కలెక్టరు శ్రీ అర్జున రావు, మునిసిపల్ కమీషనర్ శ్రీ నాగేశ్వర రావులు కలిసి, వెంగళరావు నగర్, మహాత్మా గాంధీ నగర్‌లను పేద వారి కోసం అన్ని సౌకర్యాలతో రాత్రికిరాత్రి నిర్మింపజేశారు. ఎలెక్ట్రోమాక్సు లైట్లు పెట్టి పని చేయించి మంచి నీటి సౌకర్యం కోసం గొట్టాలు వదిలి, కుళాయిలు వేయించారు. వాళ్లు అంత

> కమీషనరు కాదు- కలెక్టర్ గారే ఒకసారి పరికించాలి!

శ్రద్ధాసక్తులతో, శ్రమ తీసుకొని నిరుపేదల కోసం నిర్మింపజేసిన ఆ కాలనీల దుస్థితిని పోయి ఒకసారి దర్శించి రండి. వెంగళరావు నగర్‌ను చూస్తే ఎంత కళాహీనంగా, జనాభా పెరుగుదల తప్ప ఇతర అభివృద్ధి లేకుండా, అత్యంత దైన్యస్థితిలో వుంది. అది నెల్లూరు టవున్‌లో ఒక భాగం అనిపించదు; కరతుమ్మ చెట్ల పొదల మధ్య — ఏ కారడవి మధ్యనో వున్న గూడెమో తండానో అనే అభిప్రాయం కల్గిస్తున్నది. ఆ కాలనీలో ఎంతో విశాలమైన పార్కు వుంది. కాని ఎందుకు? ఆ కాలనీ వైభవాన్ని గూర్చి మరొక సారి వివరంగానే ఇస్తాము.

ఎవరో ఒక జాబు వ్రాశారు. తన పేరు తెలప వద్దంటారు. విచారించుకునే ప్రకటించమని ఇట్లా వ్రాస్తున్నారు; నెల్లూరు దర్గామిట్ట రోడ్లు భవనాల శాఖ సూపరింటెండింగ్ ఇంజనీరు ఆఫీసు ఎదురుగా ట్రంకు రోడ్డుకు ఆనుకొని మిలటరీ కాలని వున్నది. అక్కడ వుండేది బడాబడా ఆసాములే పెద్దపెద్ద సౌధాలే. రోడ్డు ప్రక్క నీడ చెట్లతో చల్లగా ప్రశాంతంగా వుంటుంది. ఆ కాలనీ మధ్య ఒక పెద్ద పార్కు వుంది. చెట్లు గిట్లతో అందంగా, ఆనందంగా వుందని పొరపాటు పడేరు— అదొక బీడు, బహిర్భూమి. ఎవరికి ఏ పనికి అవసరమైతే దానికి వుపయోగ పడే ఖాళీ జాగా! ఉత్తరంగా, దక్షిణంగా పెట్టిన పెద్ద గేట్లు ఎవరో దొంగలించు కొని పోయారు. అందువల్ల మనుషులకే కాదు, పశువులు, పందులు, శునకాల విహారానికి కూడా ఆటంకమే లేదు. ఆ కాలనీలో తూర్పు, పడమరలుగా ఐదారు అడ్డవీధులున్నాయి; చాలా

కొంద 11 పేజీలో

# సణుగుడు

* *వెయ్యి కోట్ల సారా సొమ్ము అసాంఘిక శక్తుల చేతుల్లోకి వస్తే ఆంధ్ర రాష్ట్రం అరాచకం పాలు కాదా?*
* *అయ్యబాబోయ్, ఇదేమి సినిమా?*

రిపబ్లిక్ డే సందేశంలో సారాయి ఉద్యమ విషయం ప్రస్తావించి గాంధేయ సోషలిస్టులలో ఈ ఉద్యమం పట్ల వున్న విశ్వాసాన్ని ప్రతిఫలింప జేశారు గవర్నరు శ్రీ కృష్ణకాంత్. గవర్నర్ గారు అంతటి సాహసోపేత సంచలనాత్మక ప్రసంగం చేయడం ద్వారా ప్రజలను ఆకట్టుకోవడం చూసి, తనకు రావలసిన క్రెడిట్ ఎవరో తన్నుక పోతారన్న దుగ్ధతో చిరచిరలాడారు ఎన్‌టి రామారావు గారు. సారాయి ఉద్యమ నిచ్చెన నెక్కి అధికార సింహాసనమధిష్ఠించాలన్న తాపత్రయం ఆయనది; కాని ఎన్నికలు కనుచూపు మేరలో లేవు. ఇప్పటి నుంచే దానితోక పట్టుకుని తిరగడం దండగ. ఈ మధ్యకాలంలో కన్నెపిల్లలతో నాలుగు డ్యూయెట్లు పాడి రక్తిని, నాలుగుకోట్లు జమచేసుకుని భుక్తిని పొందగల సినిమా షూటింగులు వుండనే వున్నాయి. తన షూటింగులు ముగించుకుని వచ్చేదాక ఆగకుండా గవర్నర్లు, గివర్నర్లు ఉద్యమం నడపబోతే ఆ మాత్రం కోపం రావడం సహజమే మరి! విజయభాస్కరరెడ్డి మాత్రం బెల్లం కొట్టిన రాయి మాదిరి నిమ్మళంగా వున్నారు. కదలికే లేదు మహానుభావుడిలో! ఎవరేమన్నా, అనుకున్నా తనను కాదన్నట్లు దులపరించుకుని పోగల స్థితప్రజ్ఞుడాయన. రామోజీరావుగారి తాపత్రయం మాత్రం రోజురోజుకీ పెరిగి పోతున్నది. ఈనాడులో ఏ పేజీ చూసినా అవే వార్తలు; ఈనాడు ఆఫీసుల నిండా అవే జెండాలు; ఈనాడు విలేఖరులు సారాయి వార్తల సేకరణలో తలమునకలై పోతున్నారు. ఆయన ఆశ ఏమిటో అంతు పట్టడం లేదు. ఆశయం అంటే మాత్రం నమ్మబుద్ధి కావడం లేదు. రామోజీ వ్యక్తిగత జీవితం, వ్యాపారదృక్పథం తెలిసిన వారెవరూ ఆయన చెప్పే ధర్మోపన్యాసాలను వినలేరు, విన్నా నమ్మలేరు. ఎక్సైజ్ అధికారుల పని మాత్రం జల్సాగా వుంది. కొందరు అధికారులకిది బంగారు పంట పండించే వరం. జిల్లాలో మొన్నొక రోజు, ఒక అధికారి ఖాళీ క్రేట్సు, పాతిక ముప్పయ్ సారాయి సంచులు బయటపెట్టి, గ్రామంలోకి విషయం చెప్పి

> డోలేంద్ర

పంపి, తగలబెట్టించి, 'ఉద్యమకారులచే రెండు వేల లీటర్లసారా దగ్ధం'' వార్త వ్రాయించి, వ్యాపీగా లోపల దాచిన సరకు అమ్ముకున్నారట. సముద్రపు అలలు లెక్కపెట్టే డ్యూటీ వేసినా, డబ్బు రాబట్టగల నేర్పరులున్నారు మనలో!

అధికారులు బాగున్నారు; మంత్రులు బాగానే వున్నారు;ముఖ్యమంత్రి దర్జాగానే వున్నారు; ఎన్టీయారాది ప్రతిపక్ష పుంగవులు జల్సాగా వున్నారు; గవర్నరాదులూ ఆశయ సాఫల్యకలల్లో విహరిస్తున్నారు; రామోజీరావాదులు సంఘ సంస్కర్తల స్టైయిల్‌లో పబ్లిసిటీ కొట్టేస్తూ సంతోషంగా వున్నారు; సారా

కొంద 7 పేజీలో

# కలెక్టర్ రిపబ్లిక్ మాటల్లో 'నెల్లూరు సస్యశ్యామలం'

43 ఏళ్ల నుండి ఏటా పోలీస్ పెరేడ్ గ్రౌండులో జరుగుతున్న రిపబ్లిక్ డే వుత్సవం ఆ ఏటికాయేడు ఢిల్లీ ఎర్రకోట వేడుక వలె, సింహపురీయులకు కొత్తగానే వుంది. విశేషంగా ఆకర్షిస్తున్నది. పోలీస్ విన్యాసం, కలెక్టరు వందన స్వీకారం, జిల్లా అభివృద్ధిని గూర్చిన ప్రసంగం వంటి పరా మామూలు కార్యక్రమాలు తప్ప మరేమీ లేక పోయినా, ఈ ఏడూ సీతాకోక చిలుకల్లాంటి చిన్నపిల్లలు తీసుక రాబడిన వారైనా, అనాహూతులు సైతం ఎక్కువగా రావడం విశేషం. చెప్పుకోదలిస్తే ఈ ఏటి ప్రత్యేక ఆకర్షణ- ఒక్కడే కలెక్టరే, మొదటి సారిగా వందన స్వీకారం చేస్తున్న రైతు కుటుంబీకుడు శ్రీ ఎం. సాంబశివరావు! మనిషి స్ఫురద్రూపి; చిరు నవ్వు ముఖం; తియ్యగా మాట్లాడ గల చాతుర్యం ఉంది. అంత దూరం వచ్చిన అహూతులకు ఇదొక్కటే స్టార్ అట్రాక్షన్.

ఎనిమిది పేజీల సుదీర్ఘ ప్రగతి పత్రం అరనై నిమిషాల్లో చదివారు కలెక్టరు గారు. జిల్లాలో ప్రగతి మూడు పువ్వులు, ఆరు కాయలుగా వుందని చెప్పారాయన. పైకు ముందు చేరి ఆయన తియ్యటి పదాలతో ఆ మాట చెప్తుంటే విన్నవారికి నిజంగా నెల్లూరు సస్యశ్యామలమై పోయినట్లే కన్పించింది; విన్పించింది. కాని అక్కడి నుండి బయట పడి, ఆయనిచ్చిన కాగితం సావధానంగా చదివితే, సస్యమూ లేదు, శ్యామలమూ కాదు — అంతా అంకెల గారడీయే!

జిల్లాలో, వాతావరణం అనుకూలించడం వల్ల, వరి పంట అధికోత్పత్తి జరగగలదని అంచనా వేశారని, సోమశిల వల్ల గత రెండేళ్లుగా

> వేడుకగా రిపబ్లిక్‌డే ఉత్సవాలు

పెన్నార్ డెల్టా క్రింద ఒక లక్ష ఎకరాలకు రెండవ పంటకు నీరివ్వగల్గామని చెప్పారాయన. అది మాత్రం నిజం.

పదహారున్నర కోట్ల పంట కాలవల పనులు (అవి డ్రైనేజి కాలువలు కాదా?) మాల్గూరుపేట నెర్రికాలువ, వెంకటగిరి, గొడ్డేరు, వాకాడు స్వర్ణముఖి బ్యారేజి పనులను ప్రస్తావించారు. పులికాట్ ప్రాంతంలో ప్రపంచ బ్యాంకు నిధులతో కట్టనున్న 12 చెక్ డ్యామ్‌ల విషయమూ చెప్పారు. ఓజిలి మండలం తిరుమల పూడిలో వేరుశెనగ విత్తన పరిశోధనా కేంద్రం స్థాపించి నట్లు చెప్పారు ; కాని — అది నిజంగా వస్తుందా? వస్తే ఎప్పటికి?

రోడ్ల విషయంలో మాత్రం కేవలం అంకెల గారడీయే! నెల్లూరు మినీ బైపాస్ రోడ్డు ఇంక రెండేళ్లకైనా పూర్తవుతుందన్న నమ్మకం లేదు; దాని నిధులూ తరలి పోయాయని చెప్తున్నారు. మెయిన్ బైపాస్‌రోడ్డు కలెక్టరు గారు రిటైరయ్యే లోగానైనా నిర్మితమౌతుందా? అనుమానమేతే రెండూ త్వరలోనే పూర్తవుతాయని కలెక్టర్‌గారు ఆశ పెడుతున్నారు. పల్లెల రహదారులకు 6 కోట్లు మంజూరైతే, 3 కోట్లు ఖర్చు పెట్టారట. నెల్లూరు, కావలి, గూడూరు టౌన్‌లలో 50 లక్షలతో రోడ్లు వేశామన్నారు? ఎక్కడో ఆ కమీషనర్లను అడిగి చెప్తాం! మద్రాసు బస్టాండు దగ్గర రెండు కోట్లతో మార్కెట్, కోటి 60 లక్షలతో రోడ్డు భవనాలు నిర్మాణంలో వున్న విషయం జ్ఞాపకం చేశారు. 31 గ్రామాలలో మంచి నీటి పథకాలు తలపెడితే పన్నెండు మాత్రమే పూర్తయ్యాయి; 422 పాఠశాల భవనాలు కట్టదలిస్తే - 73 పూర్తయ్యాయి. 5 వేల వ్యవసాయ మోటార్లకు కరెంట్ ఇవ్వాలని లక్ష్యమైతే 1600 మోటర్లకు ఇచ్చారు. వెంకటగిరిలో హ్యాండ్‌ల్యూమ్ కార్మికుల సంస్థకు రెండుకోట్ల 27 లక్షలు

కొంద 11 పేజీలో

# కృష్ణాపట్నం కోసం సిఎం గట్టిపట్టు!

రాష్ట్ర ఆర్థిక, విద్యుత్తు శాఖల మంత్రి శ్రీ కొణిజేటి రోశయ్య 24 తేది నెల్లూరు వచ్చారు. అధికారికంగా ఒక్క కార్యక్రమమే అయినా అదనంగా మరో మూడు కార్యక్రమాల్లో కూడా పాల్గొన్నారు. స్టోన్‌హౌస్‌పేటలో ఆర్యవైశ్య సంఘం, రైస్ మిల్ కాన్వాసింగ్ ఏజెంట్స్ అసోసియేషన్లు తమ స్థాయిలో హంగు, ఆర్భాటం ప్రదర్శించి రోశయ్యను స్వాగతించాయి. వుదయం చార్మినార్ ఎక్స్‌ప్రెస్‌కు రావాల్సిన మంత్రి, మధ్యాహ్నం మూడు గంటల వరకు రాకపోయేసరికి అసలు వస్తారా, రారా అనే తర్జన భర్జనలు జరిగాయి. కాని నాలుగు గంటల ప్రాంతంలో నరుకూరు రోడ్డులోని వ్యవసాయ మార్కెట్ యార్డుకు నేరుగా చేరుకొన్న మంత్రి, అక్కడి విద్యుత్ సబ్ స్టేషన్‌కు శంకుస్థాపన చేసారు. ఈ సందర్భంగా ఏర్పాటైన సభలో మాట్లాడుతూ కృష్ణాపట్నంలో వెయ్యి మెగావాట్ల సూపర్ పవర్ థర్మల్ స్టేషన్ను నెలకొల్పే విషయంలో సమస్యలుగా వున్న కోల్ లింకేజి, పోర్టు నిర్మాణం పై రాష్ట్ర ప్రభుత్వం త్వరలో కొన్ని నిర్ణయాలు తీసుకోంటుందని; సూపర్ పవర్ థర్మల్ స్టేషన్ విషయమై ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కర్ రెడ్డి కేంద్ర ప్రభుత్వంతో పట్టుదలగా

> నెల్లూరు సంగతులు

వ్యవహరిస్తున్నారని చెప్పారు. విశాఖపట్నం మద్రాస్ పోర్టు ట్రస్టులు కృష్ణాపట్నం థర్మల్ స్టేషన్‌కు బొగ్గు సరఫరా చేసే విషయంలో అసహాయత వ్యక్తపరచడం వల్ల సమస్య

కొంద 8 పేజీలో

# జిల్లా వార్తలు

## గూడూరు

# రైతుల సబ్సిడీలు అధికార్లు తినేశారు

గూడూరు డివిజన్‌లో వరి అధికోత్పత్తి పథకం క్రింద 'మార్క్ ఫెడ్' ద్వారా సబ్సిడీతో రైతులకు ఇవ్వవలసిన మందులు, పరికరాలు బహిరంగ మార్కెట్‌కు తరలి పోతున్నాయి. 92 - 93 రబీ సీజనుకుగాను రైతులకు పంపిణీ చేయను చాలా పెద్ద మొత్తంలో క్రిమి సంహారిక మందులు, పరికరాలు మంజూరయ్యాయి. కాని వీటికి ఏ శాతం మేరకు సబ్సిడీని ప్రభుత్వం ప్రకటించిందో వ్యవసాయ శాఖాధికారులు రైతులకు తెలియచేయడం లేదు. పురుగు మందుల్లో జింక్ సల్ఫేట్ ఇతర మందులకు 25 శాతం సబ్సిడీ, వ్యవసాయ పనిముట్లకు 50 శాతం సబ్సిడి ఇవ్వాలి. కాని వ్యవసాయ శాఖాధికారులు, ఎక్స్‌టెన్షన్ అధికారులు, గుమాస్తాలు, ఆటెందర్లు ఒక జట్టుగా ఏర్పడి వస్తువుల కై వచ్చిన రైతులకు ఏవేవో మాటలు చెప్పి మోసగిస్తున్నారు. వస్తువులు కొన్నాక ఇవ్వవలసిన బిల్లు కూడా ఇవ్వడం లేదు. సబ్సిడీ మందులను రాత్రికి రాత్రే బహిరంగ మార్కెట్‌కు తరలించి వీటి కోసం వచ్చిన రైతులకు లేవని సమాధానం చెబుతున్నారు. అసలు ఇవి అందజేసేందుకు ఒక క్రమ పద్ధతంటూ లేక పోయినందువల్ల పట్టాదారు పాసు పుస్తకాలు గల రైతులు కూడా ఈ సబ్సిడీ సౌకర్యాన్ని పొందలేక పోయారు. అదీ గాక ఈ సీజన్‌లో ఈ ప్రాంతంలో, వరి, వేరుశనగ పైర్లకు తెగుళ్లు సోకాయి. కాని పొలాలను సందర్శించి తగు సూచనలు ఇచ్చే అధికారే ప్రస్తుతం ఈ ప్రాంతంలో కరువయ్యారు. వ్యవసాయ శాఖ ఉన్నతాధికార్లు తక్షణం గూడూరు వెళ్లి ఈ విషయమై విచారణ జరిపి రైతులకు న్యాయం చేయాలి.

### దుస్థితిలో డేగపూడి రోడ్డు

రాపూరు - డేగపూడి ఆర్ అండ్ బి తారు రోడ్డు అత్యంత అధ్వాన్న స్థితిలో వుంది. 26 కిలో మీటర్ల పొడవుండే ఈ రోడ్డు గుంటలు, మిట్టలతో ప్రస్తుతం వొంకలా మారి పోయి వుంది. రోడ్డు పై పయనిస్తూ పొరపాటున మార్జిన్ దాటామంటె అగాధంలోకి పడిపోయినట్లే. దీనికి తోడు ఇరుపక్కల పెరిగి పోయిన కరుతుమ్మ చెట్లు ప్రయాణీకుల పాలిట ముళ్ల దెయ్యాల్లా పరిణమించాయి. 1990 సంవత్సరం లోనే ఈ రోడ్డుకు మరమ్మత్తులు చేయను నిధులు మంజూరయ్యాయి. కాని సకాలంలో చేపట్టక పోవడం వల్ల అవి మురిగి పోయాయి. రోడ్డును ఎప్పటికి బాగు చేయిస్తారో తెలియదు. కనీసం రోడ్డు పై గుంటలు పూడ్చి ఇరు పక్కల వున్న చెట్లను నరికించాలని ప్రజలు కోరుతున్నారు.

## రాపూరు

# ఎర్రచందనం దొరికింది!

రాపూరు మండలంలో అటవీ శాఖాధికారులు పోలీసులు ఈ వారంలో సంయుక్తంగా మూడు సార్లు పైగా దాడి చేసి మూడు లక్షల రూపాయలకు పైగా విలువ చేసే ఎర్రచందనాన్ని పట్టుకొన్నారు. జిల్లా సరిహద్దు ప్రాంతంలో అక్రమంగా దాచి వుంచిన 700 కేజీల దుంగలు లారీలో రవణాకు సిద్ధంగా వుండగా తొలుత పట్టుకొన్నారు. వీటి విలువ 70 వేలకు పై చిలుకే. అదే ప్రాంతంలో మరో రెండు రోజుల తరువాత దాడి చేయగా 1.50 లక్షలు విలువ చేసే దుంగలు దొరికాయి. మరుసటి దినం తెగచర్ల గ్రామం వద్ద వ్యాన్ పై దాడి చేసి వాటిలో వున్న 1.50 లక్షల విలువ చేసే దుంగలను కూడా స్వాధీనం చేసుకున్నారు. వారం రోజుల వ్యవధిలో జరిగిన దాడుల్లో ఇంత పెద్ద మొత్తంలో ఎర్రచందనాన్ని స్వాధీనం చేసుకోవడం మండలంలో ఇదే మొదటి సారి. వీటికి రాపూరు ఎస్. ఐ. షేక్ నవాబ్ జాన్, అటవీ శాఖాధికారి షేక్. ఖలీలుల్లా వారి సిబ్బంది నాయకత్వం వహించారు. దొరిన స్మగ్లింగ్ సరుకే వుంటే, దొరకనిది ఇంక ఎన్ని లక్షల్లో జిల్లా దాటుతున్నదో మరి!

## కావలి

# ఎన్ని సమితులేర్పడితే ఊరు బాగుపడుతుంది?

రాజకీయాలతో పొత్తు లేకుండా కావలి టౌన్ ప్రజల సమస్యలు పరిష్కరించే ఉద్యోగులు, మేధావులు కలసి 'కావలి సేవా సమితి' అనే స్వచ్ఛంద సేవా సంస్థను స్థాపించారు. 23 తేది నేతాజీ సుభాష్ చంద్రబోస్ జయంతిని పురస్కరించుకొని క్లాత్ మర్చంట్స్ అసోసియేషన్ హాలులో కావలి ఆర్డీవో శ్రీమతి యు. వాణీ శంకర్ సంస్థను ప్రారంభించారు. ప్రతి చిన్న పనికి ప్రభుత్వ అధికారుల పై ఆధార పడక ప్రజలు తమంతట తాముగా బ్రతికేందుకు స్వచ్ఛంధ సేవా సంస్థలు ఉపయోగ పడగల వన్న ఆశాభావాన్ని ఆర్డీవో తన ఉపన్యాసంలో వ్యక్తపరిచారు. సమితి అధ్యక్షులైన యం. చంద్రశేఖర్ రెడ్డి సమితి ఆశయాలను వివరించి పట్టణ ప్రజలు దీన్ని ప్రోత్సహించ గలరన్న నమ్మకాన్ని వెలిబుచ్చారు. కావలి డి.ఎస్.పి. కె. మాణిక్యాల రావు, విద్యుత్ శాఖ డి.ఇ. పి.గోపాల్ రెడ్డి, పోస్ట్ గ్రాడ్యుయేట్ సెంటర్ ప్రత్యేక అధికారి బి. రాఘవ రెడ్డి, ఎస్.బి.ఐ. శాఖ చీఫ్ మేనేజరు పి. రామమూర్తి, రేంజర్ సత్యనారాయణ, డివిజనల్ పి.ఆర్.టి. ఎం. వెంకటరత్నం కార్యక్రమంలో పాల్గొన్నారు. ప్రారంభానికి ముందే సమితి 23 తేది వుదయం ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వహించింది. డా. వి.వి. సుబ్బారావు, డాక్టర్ ఇందిర రోగులను పరీక్షించి ఉచితంగా మందులు పంచి పెట్టారు. కొత్తగా ఏర్పాటైన ఈ సమితిలో ఇంజనీర్లు, డాక్టర్లు, బ్యాంక్ ఉద్యోగులు, వ్యాపార వేత్తలు సభ్యులుగా వున్నారు. అభివృద్ధి అధః పాతాళానికి చేరివున్న కావలిలో ఇలాంటి సమితులు ఎన్ని ఏర్పడితే అభివృద్ధి పథాన పయనిస్తుందో?

### కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు

జిల్లాలో జనవరి 1 తేది నుండి 23 తేది వరకు 1616 కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు చేశారట. ఇందులో 1573 ట్యూబెక్టమీలు కాగా 43 వేసక్టమీలట; మరో 408 మందికి లూప్‌లు వేసారు. డివిజన్ వారీగా పరిశీలిస్తే కావలి డివిజన్ 363 ఆపరేషన్లలో ప్రథమ స్థానంలో వుండగా, 337 తో గూడూరు, 329 తో నెల్లూరు తృతీయ స్థానం వున్నాయని జిల్లా వైద్య శాఖాధికారి తెలిపారు.

# పెండ్లిండ్లు

జిల్లా కాంగ్రెస్ ముఖ్యుడు, మాజీ పార్లమెంటు సభ్యుడు, విహారరహితుడు, ఆవేశం రానంత వరకు అతి సౌమ్యుడు, సహృదయ మిత్రుడు శ్రీ షేక్ గౌస్ మొహిద్దీన్ కుమారుడు, హైదరాబాదులోని బ్యాంక్ ఆఫ్ ఇండియా లిమిటెడ్‌లో ఇంజనీరుగా పనిజేస్తున్న యోగ్యుడైన యువకుడు మహమ్మద్ జరీఫ్ అహమ్మద్ తహిర్; విజయవాడ డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసరు శ్రీ టి.ఎస్. గౌస్ మొహిద్దీన్ కుమార్తె షీన్ పరిణయం జనవరి 17 తేది టవున్ హాలులో పూర్తిగా ముస్లిం సాంప్రదాయాను గుణంగా జరిగింది. గౌస్ మొహిద్దీన్ బంధు కోటి కాకుండా, రాజకీయ మిత్రులు, అధికార్లు అనేక మంది వచ్చారు.

పెండ్లి ముహూర్తం లేదు; వేదిక మీద కళకళ లాడే ముత్తైదువలు లేరు; ఉత్సాహకరంగా మనోల్లాస కరమైన నాదస్వరం వంటి వాద్యాలేమీ లేవు... నిజం చెప్పాలంటె ఈ రచయితకు పెండ్లి ఉప్పులేని పప్పు లాగా వుండింది! ఫలావ్ మాత్రం పసందుగా వుండి వుండవచ్చు. మరచాను - వెజిటేరియన్ భోజనం కూడా వుందని చెప్తుండినారు.

* * *

ఇదీ ఒక మేళ తాళాలు, మంత్ర తంత్రాలు లేని కమ్యూనిస్టు సాంప్రదాయంలో సాగిన ప్రమాణాల పెండ్లి! ఏమీ లేకుంటె ఏమి వధూవరులు జీవిత భాగ స్వాములై పోయారు.

నెల్లూరు తోటి పట్టుకొని వుండిన శనిని వదలించుకొని, మద్రాసు చేరి రామకృష్ణ మఠం స్వాములకు ప్రేమ విశ్వాస పాత్రుడై, వివేకానంద కాలేజి పాలక వర్గం ఉపాధ్యక్షుడుగా వుంటూ, అనేక మంది అధికార, అనధికార ముఖ్యుల స్నేహ గౌరవ సంపదను ఆర్జించుకొని, తర్వాత మజిలీ ఎక్కడో గాని ప్రస్తుతానికి బెంగుళూరు నివాసిగా వున్న శ్రీ కాకాణి రమణారెడ్డి దౌహిత్రుడు; బొగ్గు గనుల ప్రావిడెంటు ఫండు ప్రాంతీయ కమీషనరుగా హైదరాబాదులో వున్న నీతి నిజాయితీ

కాలం 7 పేజీలో

## రిపబ్లిక్‌డే

# పాఠశాలకు విరాళాలు

రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా కావలి మండల ప్రజా పరిషత్ బాలుర హై స్కూల్లో జరిగిన వేడుకల్లో ఎమ్మెల్యే శ్రీ కలికి యానాది రెడ్డి ముఖ్య అతిధిగా పాల్గొన్నారు. పాఠశాల అభివృద్ధి కొరకు సభకు విచ్చేసిన పలువురు విరాళాలు ప్రకటించారు. ఎమ్మెల్యేతో పాటు పట్టణ ప్రముఖులు ఎల్. కృష్ణమూర్తి, పి. వెంకటేశ్వర్లు వీరిలో వున్నారు. కార్యక్రమానికి ప్రధానోపాధ్యాయుడు పి. ప్రకాశ రావు అధ్యక్షత వహించారు.

### గురుకుల పాఠశాల్లో ఉత్సవం

చెన్నూరు మిత్రమండలి ఆధ్వర్యంలో అక్కడి గురుకుల పాఠశాలలో రిపబ్లిక్ దినోత్సవ వేడుకలు జరిగాయి. పర్యావరణ కాలుష్యం జాతీయ సమైక్యత అనే అంశాల పై పాఠశాల పిల్లలకు వ్యాస రచన పోటీలు నిర్వహించారు. విజేతలుగా నిలిచిన విద్యార్థులు జె. అరుణ, ఎ. మాధవి, ఎం. శార్వాణి, ఎస్. ప్రసాద్, కె.ఎం. రాజాలకు ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్ అధికారులు సి.హెచ్. రాఘవ రెడ్డి, సుబ్రహ్మణ్యం బహుమతులంద జేశారు. కార్యక్రమంలో మిత్రమండలి సభ్యులు కూడా పాల్గొన్నారు.

కాలం 7 పేజీలో

## అల్లూరు

# జనం లేని మతసామరస్యసభ

మత సామరస్యాన్ని కోరిస్తూ చేస్తున్న సి.పి.ఎం. పాదయాత్ర బృందం 26 తేది రాత్రి అల్లూరు చేరుకొంది. 23 తేది కావలిలో బయలుదేరిన ఈ బృందం వాముదల, జలదంకి, బిట్రగుంట మీదుగా అల్లూరు చేరుకొంది. 30 మందికి పైగా సభ్యులున్న బృందం సాయంత్రం నినాదాలు చేస్తూ పట్టణ ప్రధాన వీధుల గుండా సాగి పోయి చిత్రకూటాన్ని చేరుకుంది. అక్కడ జరిపిన బహిరంగ సభలో డివిజన్ పార్టీ కార్యదర్శి గండవరపు బాలకృష్ణా రెడ్డి, మాజీ శాసనసభ్యుడు బస్వారెడ్డి శంకర రెడ్డి ప్రసంగించారు. అల్లూరులో సి.పి.ఎం. పార్టీ బహిరంగ సభలు నిర్వహిస్తే ఇది వరకు జనం దండిగా వచ్చేవారు. కాని 26 తేదీ జరిగిన సభ జనం లేకుండా వెలవెల పోయింది.

### అల్లూరీయులకు ప్రశంసా పత్రాలు

గత ఏడాది వివిధ ప్రభుత్వ శాఖల్లో విధి నిర్వహణలో అత్యుత్తమ ప్రతిభ కనపరచి నందుకు ముగ్గురు అల్లూరీయులు రిపబ్లిక్ దినోత్సవం పేరేడ్‌లో జిల్లా కలెక్టర్ నుండి ప్రశంసా పత్రాలు అందుకొన్నారు. ప్రభుత్వ సెక్యూల్ పథకాలను చక్కగా అమలు పరచినందుకు బ్యాంకింగ్ రంగం నుండి పినాకినీ గ్రామీణ బ్యాంకు నెల్లూరు టౌన్ మెయిన్ బ్రాంచి మేనేజరు ఇ. జయపాల్ ప్రశంసా పత్రం అందుకొన్నారు. ఈయన అల్లూరు పేట నివాసి. జిల్లాలో జరిగిన వివిధ దోపిడి దొంగతనాలకు సంబంధించిన దొంగలను గూర్చి చాకచక్యంగా ఆరా తీసి పట్టుకొన్నందుకు టౌన్ సెంట్రల్ క్రైమ్ స్టేషన్ సబ్ ఇన్‌స్పెక్టర్, అల్లూరీయుడు ఆర్. నాగేశ్వర రావుతో పాటు వివిధ ప్రభుత్వ పథకాలను చక్కగా అమలు చేసిన అల్లూరు మండలాభివృద్ధి అధికారి డి.వి. రమణయ్య కూడా ఉత్తమ అధికారిగా ప్రశంసా పత్రాలు పొందారు.

### బుచ్చి సభ

బుచ్చిరెడ్డి పాళెం మండల సి.పి.ఎం. పార్టీ శాఖ 27 తేది గ్రామంలో మత సామరస్యం పై

కాలం 7 పేజీలో

## నెల్లూరు ముచ్చట్లు
### విమర్శకుడు

### పెంచలయ్య

సమాచార మంత్రి శ్రీ పసల పెంచలయ్య 30 తేది ఉదయం నెల్లూరు వస్తున్నారు. ఆ రోజంతా నెల్లూరే. 31 తేది నాయుడుపేట, సూళ్లూరుపేట. రాత్రికి నెల్లూరు; 1 తేది జొనలో ప్రోగ్రాములు – రాత్రికి ఛార్మినార్ ఎక్స్‌ప్రెస్ ఎక్కి చలో!

### జి.కాం. గాంధీ వర్ధంతి

జిల్లా కాంగ్రెస్ ఆధ్వర్యాన గాంధీజీ వర్ధంతి 30 తేది ఉ.10.గంటలకు ఇందిరా భవనంలో జరుగుతుంది. మంత్రి శ్రీ పసల పెంచలయ్య పాల్గొంటారు. అప్పుడే 11గంటలకు ఒక్క నిమిషం మహాత్ముని ఆత్మశాంతికై మౌనం పాటించబడుతుంది. కాంగ్రెస్ వాదు లందరూ ఈ పవిత్ర కార్యక్రమంలో పాల్గొనవలసిందిగా అధ్యక్షుడు శ్రీ ఆనం సంజీవరెడ్డిగారి ఆహ్వానం.



మాజీ ముఖ్యమంత్రి శ్రీ జనార్దనరెడ్డి ఫిబ్రవరి రెండవ వారంలో వస్తారని, ఆసందర్భంలో జి.కాం. కొత్త కార్యవర్గ ప్రారంభోత్సవం ఆయనచేత జరుపబడుతుందని కూడా సంజీవ రెడ్డిగారు చెప్పారు.

మొత్తానికి ఆనంకి హుషారు మళ్లీనట్లుంది!

### పెళ్లకూరు జన్మదినం

'ఇఫ్కో' ఛైర్మన్ శ్రీ పెళ్లకూరు రామచంద్రా రెడ్డికి 70 ఏళ్లు నిండి 71 సంవత్సరంలో ప్రవేశిస్తున్న మార్చి 5 తేది నెల్లూరులో సప్త దశాబ్దిపూర్తి వుత్సవం గ్రాండు స్కేలులో జరుగుతుందట. దీని కోసం ఒక కమిటీ కూడా ఏర్పడింది.

### శ్రీనివాసులు రెడ్డి ఆరోగ్యం మెరుగు?

న్యుమోనియా వ్యాధి తీవ్రమై నిజాం ఇన్స్‌టిట్యూట్‌లో చికిత్స పొందుతున్న నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి గారి ఆరోగ్యం ఇప్పుడు మెరుగ్గా వుంది. కోమాలోకి వెళ్లే పరిస్థితిని తప్పించుకుని, కోలుకుంటున్నారు. కిడ్నీలూ బాగుపడ్డాయి. ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కర రెడ్డి ఆస్పత్రికి వెళ్లి, పరామర్శించి, అత్యవసర మందులను విదేశాల నుంచి అప్పటి కప్పుడు తెప్పించారట. ఆస్పత్రి జన సముద్రంగా వుంది – వచ్చే, పోయే వారితో!

శ్రీనివాసులు రెడ్డి గారు త్వరితంగా కోలుకుని, పరిపూర్ణ ఆరోగ్యంతో తిరిగి రావాలని ఆకాంక్షిస్తున్నాము.

### వైఎస్ సభ

రాష్ట్ర కాంగ్రెస్ నాయకుడు, పార్లమెంటు సభ్యుడు డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి 5 తేది ఉదయం నెల్లూరు వస్తున్నారు. ఎన్ఎస్‌యుఐ విజయకుమార్ రెడ్డి ఆయనతో ఒక కార్యకర్తల సమావేశం తలపెట్టారు. ఇందిరా భవన్ అడిగితే ఇవ్వలేదట. పైగా 'నువ్వు మీటింగు పెట్టబాకు' అని ఒక పెద్ద నాయకుడు సలహా ఇచ్చాడట. ఇంకేముంది – విజయకుమార్ రెడ్డి సంగతి తెలిసిందే కదా – [illegible] వివాదంగా మార్చాడు. ఇప్పుడు వైఎ[illegible] సర్వోదయ కాలేజి ఆవరణంలో జ[illegible]ది.

### నెల్లూరు క్లబ్

ఏదో బాగుపడుతుంది అనుకుంటే మళ్లీ పాత బాటనే నడుస్తున్నట్లుంది. క్లబ్ నిర్వహణ అంటే వళ్లు తెలియని స్థితిలో ప్రవర్తించడం కాదు. ప్రాస్తే క్లబ్ పరువు పోతుంది– తప్పుసరిదిద్దుకోండి!

అధ్యక్షుడు పాముూరు [illegible]కర్ రెడ్డి సంస్కార వంతుడే; కాని మె[illegible]క దనం జాస్తిగా వున్నట్లుంది; కన్నెర్ర చేయకుంటే ఈ రోజుల్లో ఎవరూ మాట వినరండీ!

### అస్వస్థతలు

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీకాంతమ్మ స్వల్పపక్షవాతానికి గురియై మద్రాసు విజయ హాస్పిటల్లో చికిత్స పొందుతున్నారు. కొంత నయమని. నడిపించడం ఇతర థెరపి ప్రక్రియలు కూడా జరుపుతున్నారని. రేపు ఎల్లుండిలో డిశ్చార్జి అవుతారని తెలుస్తున్నది. నెల్లూరుకు తీసుక వస్తారో, మద్రాసులోనే వుంచుతారో తెలియదు. గతంలో ఒకసారి ఇదే విధంగా స్వల్పంగా పక్షవాతం వచ్చి బాగైపోయిన 71 ఏళ్ల స్వాతంత్ర్య సమర యోధురాలీమె.

* * *

సర్వోదయ కాలేజి కమిటి అధ్యక్షుడు, ప్రఖ్యాత ఎరువుల వ్యాపారి, సతత ఖద్దరుధారి శ్రీ యడ్లపల్లి గోవిందు శెట్టి తీవ్ర అస్వస్థతకు గురియైనారు. ఆయనకు రక్తపోటు వుంది; 18 తేది రాత్రి తూలిపడిపోగా జయభారత్ ఆస్పత్రిలో చేర్పించారట; మూడు రోజులు కాబోలు వుండినారు; మధ్యలో పక్షవాతం వచ్చింది. 28 తేది మద్రాసుకు తరలించారు.

సతీ వియోగం, సర్వోదయ కాలేజి వివాదాలు వ్యాజ్యాలు, అతన్ని క్రుంగదీసి వుంటాయి. 78 ఏండ్ల వయస్సులో ధార్మిక బుద్ధి గలిగిన గోవింద శెట్టికి ఈ శిక్ష ఏమిటో మరి!

### మరణాలు

వెంకటగిరి సంస్థానం చివరి జమీందారు కీ.శే. సర్వజ్ఞ కుమారకృష్ణ యాచేంద్ర గారి సతీమణి శ్రీమతి సామ్రాజ్య లక్ష్మమ్మ (83) 27 రాత్రి దివంగతురాలైంది. ఆమెకు ఇద్దరు కుమారులు - శ్రీ వి.వి.వి.ఆర్. యాచేంద్ర, శ్రీ గోపాలకృష్ణ యాచేంద్ర. వెంకటగిరి తెలుగుదేశం ఎం.ఎల్.ఎ. గా వుండిన విద్యాధికుడు, కవి, అవధాని, డాక్టర్ సాయి కృష్ణ యాచేంద్రకు ఆమె నాయనమ్మ.

* * *

ఏభై ఏళ్లకు ముందే నెల్లూరులో సాకరియా పేరుతో ఘుమఘుమలాడే వక్కపొడి పొట్లాలను ప్రవేశ పెట్టి తాంబూల ప్రియుల ప్రశంసలు పొందిన శ్రీ ఒ.ఎస్. సాకరియా (77) 23 తేది స్వర్గస్తులైనారు. ఆ రోజుల్లో సాకరియా వక్కపొడి పొట్లాం ఖరీదు పిండబ్బు! ఇప్పుడు వక్కపొడి తయారీ మాని, పాన్ మసాలాలు చేస్తున్నారట. ఆయనకు ఒక కుమారుడు, ఒక కుమార్తె.

* * *



బహుశా నెల్లూరులో మొట్టమొదటి కంపోజిటర్‌గా రామా ప్రెస్‌లో జీవితాన్ని ప్రారంభించి, ప్రెస్ ఓనరై, అర్బన్ బ్యాంకు ఉపాధ్యక్షత – ట్రెజరర్ పదవుల వరకు ఎదిగిన అతి మంచి వ్యక్తి శ్రీ ఆర్. బాలాజీ సింగ్ (95) 26 తేది కాలధర్మం చెందారు. ఆఖరు వరకు తిరుగుతూ, పరిపూర్ణ జీవితాన్ని గడిపిన ధన్యజీవి ఆయన. ఆయనకు ముగ్గురు కొడుకులు, ఇద్దరు కుమార్తెలు వున్నారు.

రాజా గారలకు, బాలాజీ సింగు, సాకరియా కుటుంబాలకు మా సానుభూతి తెలియజేస్తున్నాము.





Engineer **G.K. REDDY**

Rtd. Chief Engineer
Mechanical – P.W.D.,
Andhra Pradesh

## ...సంస్మరణ

మా ఇంటి వెలుగు, సహాయశీలి, సహృదయుడు

### ఇంజనీర్ జి.కె. రెడ్డి గారి

(గునుపాటి వేణుగోపాలకృష్ణా రెడ్డి)

రిటైర్డ్ చీఫ్ ఇంజనీర్, మెకానికల్ పి.డబ్ల్యు.డి. ఆం.ప్ర

**30.1.1993** తేది తృతీయ వర్ధంతి

ఈ సందర్భంలో వారిని సంస్మరిస్తూ

- కుటుంబ సభ్యులు

## పెండ్లిండ్లు

(5 పేజీ కారవ)

నిరాడంబరత నిర్మొగమాటపు స్వభావాలు గలిగిన సొమ్ముర్తు జిడ్డు కృష్ణమూర్తి గారి కన్య పరమాణువు శ్రీ సి.హెచ్. రెడ్డి కుమారుడు యోగానంద్; శ్రీ జి. వాసుదేవ రెడ్డి కుమార్తె ప్రమోదిని పరిణయం 25 తేది తిరుమలలోని కర్ణాటక భవనంలో నిశ్శబ్దంగా విందుగా, వరుని అభీష్టానికి అనుగుణంగా జరిగింది.

ఎవ్వరికీ అర్థంగాని సంస్కృత మంత్రాలు, గుండెలదరగొట్టే డోలు సన్నాయి బ్యాండు వాద్యాలు, పట్టపగలు కన్ను పొడుచుకున్నా కనపడని అరుంధతి దర్శనం వంటి సాంప్రదాయిక ఆచారాలకు స్వస్తి చెప్పబడింది. జీవితాంతం నిన్ను నా సతిగా స్వీకరించి నూరేండ్లు ఏకపత్ని వ్రతుడుగా జీవితం సాగిస్తానని వరుడు యోగానంద్; నిన్ను నా పతిగా అంగీకరించి జీవితాంతం పతివ్రతనై సుఖ దుఃఖములను నేను నీతో పంచు కుంటానని వధువు ప్రమోదిని ప్రమాణాలు చేశారు. ప్రమాణాలు శ్రీ వెంకటేశ్వర స్వామి సాక్షిగా జరిగాయి. పూలదండల మార్పు, వధువు మెడలో వరుడు మంగళ సూత్రం కట్టి భార్యాభర్తలు కావడం జరిగింది. వివాహ పౌరోహిత్యం 'ఉదయం' పత్రిక తిరుపతి ఎడిషన్ న్యూస్ ఎడిటరు శ్రీ పి. గోపాలకృష్ణ (గోపి)ది!

మధ్యాహ్నం విందు మాత్రం బహురుచికరంగా వుండినదన్నారు తిని త్రేపిన భోక్తలు!

ఆఖరున ఆహూతుల నుండి వినవచ్చిన మాట – ఈ నిరాడంబర వివాహానికి తిరుమలను ఎన్నుకొని వ్యయప్రయాసలకు తాము గురియై ఇతరులను గురిచేయడం కంటే, బెంగుళూరు లోనే రిజిష్టరు పద్ధతి ద్వారా చేసి వుంటే ఇంకా ఎంత నవీనంగా వుండేది– అన్నారు.

* * *

అన్నపూర్ణ ఇన్సెక్టిసైడ్స్ పేరుతో పైర్ల తెగుళ్ల పురుగుల మందుల ఉత్పత్తి పరిశ్రమను నెలకొల్పి ఒడిదుడుకులు లేకుండా గట్టి పునాదులు ఏర్పరచి నిర్వహిస్తున్న పారిశ్రామికుడు శ్రీ కొండపల్లి సుబ్రహ్మణ్యం పుత్రిక ప్రసూన బి.ఎస్.సి.; మద్రాసు – శ్రీ కల్వి రాజశేఖర్ బి.ఏ., పుత్రుడు దినేష్ బి.ఇ. వివాహం 24 తేది నెల్లూరు టి.టి.డి.లో జరిగింది.

* * *

'నవయుగం' సంపాదకుడు గాకంటే, ప్రజా సంబంధాలలో అఖండ మేధావి, ఎవర్‌గ్రీన్‌గా, ఎప్పుడూ ఫ్రెష్‌గా, సహజంగాని తెచ్చుకున్నది గాని – ఎల్లవేళలా చిరు నవ్వు చిద్విలాసాన్ని ఒలికించే పాత మిత్రుడు శ్రీ జి.ఆర్. కృష్ణమూర్తి కుమారుడు రంగారావు; నెల్లూరు – శ్రీ గార్లపాటి మారుతీ ప్రసాద్ కుమార్తె పవని పెండ్లి 24 తేది రాత్రి శ్రీ పాండురంగ అన్నదాన సమాజంలో జరిగింది. ఆ రోజు నెల్లూరులో వుండిన మంత్రి శ్రీ రోశయ్య హాజరై వధూవరులను ఆశీర్వదించి పోయారు.

* * *

సౌజన్యవంతుడైన చెర్లోపాళెం వాసి శ్రీ నాగారెడ్డి మధుసూదన రెడ్డి కుమారుడు కిశోర్; ఒంగోలు – స్వర్గీయ వాకా వెంకట స్వామిరెడ్డి గారి కుమార్తె పద్మావతి పరిణయం 24 తేది నెల్లూరు శ్రీ కస్తూరి దేవి విద్యాలయంలో జరిగింది.

* * *

లేగుంటపాడు వాసి, వదుగుపాడు సుందర మహలీయుడు, మాజీ బస్ ఓనరు, నిత్య నూతనోత్సాహి, నిరాడంబరుడు శ్రీ జెట్టి కృష్ణారెడ్డి తనయ సునంద; శ్రీ కాళహస్తి – శ్రీ పంగూరు దశరథ రామరెడ్డి తనయుడు, పారిశ్రామికుడైన ఇంజనీరింగు పట్టభద్రుడు సునీల్ వివాహం 24 తేది వదుగుపాడు సుందర మహల్లో జరిగింది.

## ఈ సవాల్

( మొదటి పేజీ కారవ)

గారు పదవి స్వీకరించిన నాటి నుంచి నక్సలైట్ల సమస్య పట్ల స్పష్టమైన విధాన నిర్ణయమేదీ తీసుకోలేదు. పోలీసులకూ సరైన ఆదేశాలు లేవు. జనార్దనరెడ్డి ప్రభుత్వ హయాంలోని విధానాలనే పోలీసులు తమ స్వంత విచక్షణతో పాటిస్తున్నారు. ఆ అస్పష్టవైఖరి సత్ఫలితాలనివ్వడం లేదు. వ్యాస్ హత్య సృష్టించిన భయకంపిత వాతావరణం మాసైనా ప్రభుత్వం ఏదైనా నిర్ణయాలు తీసుకుంటుందేమో వేచి చూడాలి.

## అల్లూరు

(5 పేజీ కారవ)

బహిరంగ సభ నిర్వహించింది. పార్టీ జిల్లా కార్యదర్శి, మాజీ శాసనసభ్యుడు జక్కా వెంకయ్య, తెలుగుదేశం జిల్లా వుపాధ్యక్షులు బెజవాడ ఓబుల రెడ్డి, సి.పి.ఎం. పార్టీ మండల కార్యదర్శి జె. వెంకమాంబ రాజా మత సమైక్యత ఆవశ్యకతను నొక్కి చెబుతూ ప్రసంగించారు.

## రిపబ్లిక్

(5 పేజీ కారవ)

## పల్లెపాడు టి.టి.సిలో వేడుక

పల్లెపాడు వుపాధ్యాయ విద్యా శిక్షణా కేంద్రంలో రిపబ్లిక్ దినోత్సవ వేడుకలో భాగంగా ప్రిన్సిపాల్ శ్రీ ఎం. శ్రీరాములు పతాకావిష్కరణ చేసారు. శిక్షణలో వున్న వుపాధ్యాయులతో పాటు ప్రత్యేక శిక్షణకు వచ్చి వున్న ఇన్ సర్వీసు టీచర్లు, హాస్టల్ వార్డెన్లు పాల్గొన్నారు. ఈ సందర్భంగా విద్యార్థులు ప్రదర్శించిన విచిత్ర వేషధారణ, విమిక్రీ, మైమింగ్ ప్రదర్శనతో పాటు లంబాడీ నృత్యం ప్రేక్షకులను అలరించాయి.

## జనవాణి

(3 పేజీ కారవ)

గ్రాంటుకూడా ఇచ్చేస్తున్నారు. ఇక్కడ మన ఆంధ్రావనిలో ఒక కాలేజికి ఐదేళ్లు నిండగానే గ్రాంటు ఇచ్చే ఆచారం ఒకటి ఇంకా కొనసాగుతున్నది. ఆ ఐదేళ్ల గడువు అనధికారికంగా పది పన్నెండేళ్లకు కూడా పాకిపోతున్నది. పది పన్నెండేళ్లు ఒక ప్రయివేట్ కాలేజిలో పనిచేసినా కళాశాలకు గ్రాంటు వచ్చిన నాటినుండే లెక్చరర్ల సర్వీసును ప్రభుత్వం పరిగణనలోకి తీసుకుంటున్నది. అంతేసి సర్వీసు వున్నా లెక్చరర్ల జీతం స్కేలును "స్టార్టింగ్‌స్కేలు" తోనే సరిపెడుతున్నారు. అయినా ఇదేమి ఘోరం అని అడిగిన అయ్యవారు లేరు. ఇకపోతే కాలేజీ లెక్చరర్లంతా కొంత కాలంగా ప్రభుత్వాన్ని ప్రాథేయ పడుతున్న విషయం అన్‌ఎయిడెడ్ సర్వీసు గుర్తింపు. ఇటువంటి గుర్తింపు వల్ల వారికి పదోన్నతి అవకాశాలు, పెన్షన్ సౌకర్యాలు, కొంతకు కొంత మెరగవుతాయి. శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డి గారు విద్యామంత్రిగా, ముఖ్యమంత్రిగా వున్న కాలంలో లెక్చరర్ల ఈ కోర్కెను ఎంతో కాలం లోతుగా పరిశీలించి, సాధక బాధకాలు ఆలోచించి సానుకూలంగా నిర్ణయం చేశారు. వారి పదవీత్యాగం తరుణంలో వచ్చిన ఈ న్యాయమైన నిర్ణయాన్ని 'కోట్ల' ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా రద్దుచేయడం దురదృష్టకరం. ఈ రద్దు అక్రమం. దీనిని పునఃపరిశీలించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి.

-తిరుమూరు సుధాకర్ రెడ్డి

నెల్లూరు.

## సణుగుడు

(4 పేజీ కారవ)

ప్రియులూ చవకగా ఘాటైన నిషా నెక్కించే నాటుసారా సేవిస్తూ సంబరపడుతున్నారు. మరి మామూలు జనమో?

వారి గతే భయంకరంగా కన్పిస్తున్నది. ముందు ముందు సారా నిషేధం విధించాల్సిన పరిస్థితి వస్తే ప్రభుత్వం వూరకుండదు; చేజారిపోయే వెయ్యి కోట్ల ఆదాయాన్ని ఏదో ఒక పన్నుల రూపంలో పిండి తీరుతుంది. ఆ బరువంతా మోయాల్సింది ఎవరు- మనమే; ఇప్పటికే ఇటు రాష్ట్రం, అటు కేంద్రం ఎడా పెడగా పెంచిన పన్నుల దెబ్బలతో వళ్లు పులిసి పోయివుంది. మళ్లీ ఇంత పెద్ద భారం పైన పడనుండంటే పాతాళానికి క్రుంగి పోతామేమోనని భయమేస్తున్నది. సారాయి నిషేధం వల్ల పైన బడనున్న మరొక పెద్ద ప్రమాదం - దొంగ సారాసామ్రాజ్యాల విస్తరణ. రాష్ట్ర ప్రభుత్వం ఏటా 800 కోట్ల రూపాయల ఆదాయం ఒక్క ఎక్సైజ్ నుంచే పొందుతున్నది. ఇదంతా సారాయి కాంట్రాక్టర్లు కట్టే కిస్తీలు, లైసెన్సు ఫీజులద్వారా సమకూరేదే ఇది. ఎప్పుడైతే సారాయి నిషేధం విధిస్తారో, ఆ మరుక్షణం నుంచి ఈ సొమ్మంతా దొంగసారా కాంట్రాక్టర్ల చేతుల్లోకి వెళ్తుంది. సర్కారుకు చిల్లిగవ్వ కూడా కట్ట నవసరం లేకుండా, కంట్రాక్టర్లే సమస్తం బొక్కుకొంటారు. నిషేధం వల్ల త్రాగుడు తగ్గిపోతుందన్నది కేవలం భ్రమ. దొంగసారా వ్యాపారం చేసే వారిలో నూటికి తొంభైపాళ్లు అసాంఘిక శక్తులే. అందులోనూ ఏ పూరికాపూరిలో, ఏ టౌన్‌కు ఆ టౌన్‌లో అల్లరి చిల్లరిగా తిరిగే వారంతా ఈ అల్పాదాయం కోసం ఎగబడతారు. ఇటువంటి శక్తుల [illegible] ద్యుకోట్ల డబ్బు చేరితే రాష్ట్రం ఏ మౌతుంది? విజయవాడలో రౌడీలుగా వున్నవారు రాజకీయ నాయకులై సృష్టించిన విలయం చూశాం; హైదరాబాదులో కొత్తదాను వంటి గూండాల రాజ్యం గురించి విన్నాం; చిత్తూరులో పట్టపగలు ఇళ్లపై పడి మానభంగాలు చేసే రౌడీల దురాగతాలు చూస్తున్నాం. ఇటువంటి వారి ఇళ్లలో లక్షల్లో కోట్లలో డబ్బు చేరితే ఆ వూర్లు తగలబడి పోవా? క్రూరమృగాల బారిన పడిన కుందేలు పిల్లల్లా జనం అల్లాడి పోరా? వారిని అదుపు చేయడం ఏ ప్రభుత్వ తరమౌతుంది? ఎవరి కారణాలతో వారు సారాయిని నిషేధించాలని కోరే పెద్ద మనుష లంతా త్రాగుడు మాన్పించ కుండా నిషేధం విధిస్తే వచ్చే విపరిణామాల గురించి ఆలోచించి, ముందుకు నడవడం అవసరం కాదా?

* * *

చిరంజీవికి రాజకీయ పైత్యం బాగా ప్రకోపించింది; ఏ మందూ మాన్పలేనంత ఉధృతంగా ఆ గజ్జి, తామర అంటుకున్నాయి. రాజకీయాల లోకి వస్తే వచ్చారు కాని, ఆ సాకుతో ఆ పైత్యమంతా క్రుమ్మరించి భయంకరాతి భయంకర సినిమాలు తీసి ప్రేక్షకుల ఓర్పును పరీక్షించేయడమే ఏమీ బాగాలేదు. 'ముఠామేస్త్రి' అట- అదేమి సినిమా బాబోయ్! తెలుగు ప్రేక్షకుల మీద ఎంతకోపముంటే మాత్రం అంత భయంకరంగానా శిక్షించేది? రాజకీయాల్లో జనాన్ని ఉద్ధరించాలంటే- ముష్ఫాతిక నగ్నంగా వుండే పడమలతో క్రిందామీద పొర్లాడాలా? పావడ పైకెత్తి లోపలేముందో చూడాలా? లుంగీవిప్పి గంతులేయాలా? దారిన పోయే రౌడీలను ఫటాఫట్‌మన్పించేయడమే రాజకీయమా? ప్రజాసేవా? అవసరమైతే ఏడు కోట్ల ఆంధ్రులను రక్షించను రంగంపైకి వచ్చేస్తానని పెద్దఫోజుతో డైలాగులు విసిరాడు చిరంజీవి. సినిమాలలో వుండేవారంతా తమను తాము శ్రీకృష్ణ పర[...]త్ములవలె భావించు కుంటుం టారా- ధర్మసంస్థాపనార్థం అవతరిస్తామని చెప్పడానికి? సినిమా నటులకు సమాజంలో అవినీతి గురించి, కుళ్లు గురించి మాట్లాడే హక్కెక్కడిది? తీసుకునే కోటి రూపాయల పారితోషికానికి చూపించే ఇన్‌కంటాక్స్ లెక్క ఎంత? అది అవినీతి క్రిందకు రాదా? డబ్బుకోసం నైతిక విలువల పతనాన్ని ప్రేరేపించే పచ్చి బూతు డ్యాన్సులు, పొర్లికింతలు పెట్టే వారు సమాజంలో కుళ్లును ఏమి కడుగుతారు?

చిరంజీవి ఏదోమైకంలో వున్నట్లున్నారు. సినిమా రంగంలో లైమ్‌లైట్‌లో వుండేవారి ప్రక్కన ఎప్పుడూ భజన పరులు చేరుతారు; వళ్లు తెలియని నిషా ఎక్కిస్తారు; సినిమా రంగంలో అయితే అది చెల్లుతుంది- ప్రజల మధ్యలోకి వస్తేగాని కళ్లు తెరిపిన పడవు. అయ్యా చిరంజీవిగారూ- మీరు రాజకీయాలలోకి వస్తే వచ్చారు గాని, ఇంత ఛండాలపు చిత్రాలు తీసి ఆంధ్రులను చిత్రహింస పెట్టడం మాత్రం మానుకోండి సార్!

## జనరల్ నోటీసు

ఇందుమూలముగా యావన్మందికి తెలియ జేయడమేమనగా నా అన్నగారైన కోదూరు కోటారెడ్డిపై సమాన హక్కుల కొరకు నెల్లూరు సబ్‌కోర్టులో O.S. 217/81దావా వేసి వుండి సదరు కేసు హైకోర్టులో A.S 1681/91 గా అప్పీలు చేయబడివున్నది. నెల్లూరు రాజవీధిలోని 16/236 డోర్‌నెం.గల మిద్దె యిల్లు, ఖాళీ స్థలం అప్పీలు పెండింగులో వుండగా మా అన్నగారైన శ్రీ కోదూరు కోటారెడ్డిగారు తదితరులు అమ్మజూపు చున్నట్లు తెలియచున్నది. సదరు ఆస్తిలో సగభాగము నాకు హక్కు గలిగి యున్నందున ఎవరికినీ అమ్ముటకు, లేక పరాధీనము చేయుటకు హక్కులేదు. ఎవరైనా కొనుగోలు చేసినయెడల కలుగు కష్టనష్టములకు కొన్నవారే బాధ్యుల గుదురు.

కోదూరు ఆదినారాయణరెడ్డి.

## మూడవ అదనపు మునసబు కోర్టు, గుంటూరు

E.P. 657/90 :: O.S. 601/86

ది వైశ్య బాంకి లిమిటెడ్, అరండల్ పేట, గుంటూరు - D.H.R.

1. మలిశెట్టి సుబ్బారావు
2. అవుల జ్వాలాపతి - J.D.R.s

ఈ నెంబరు తాకట్టు బాకీ క్రింద 1వ జె.డి.ఆర్. తాలూకు యీ దిగువ షెడ్యూలు దాఖలా స్థిరాస్తిని పై కోర్టు వారి యెదుట 8.2.93 తేది ఉదయం 10.30 గంటల నుండి వేలము వేయబడును. గాన కావలసిన వారు పాటపాడుకొన వచ్చును.

### షెడ్యూలు

1. గుంటూరు డిస్ట్రిక్ట్, చేబ్రోలు సబ్ డిస్ట్రిక్ట్, గొడవర్రు గ్రామం డి.నెం. 317 గల ఎం. 73. HO - 2954 గల భూమికి హద్దులు.

తూర్పు: చిన్నంశెట్టి శ్రీనివాస రావు భూమి; దక్షిణం: చిన్నంశెట్టి లక్ష్మయ్య భూమి; పడమర: కోటి సూర్యప్రకాశ రావు భూమి; ఉత్తరము: చిన్నంశెట్టి వెంకట స్వామి భూమి.

D.H.R. Value Rs. 3,700/-

Amin Value Rs. 25,000/-

2. గుంటూరు డిస్ట్రిక్ట్, చేబ్రోలు సబ్ డిస్ట్రిక్టు, గుండవరం గ్రామము D.Ho. 267/2 గల ఎ. 0.89. HO - 3601 గల భూమికి హద్దులు.

తూర్పు: అప్పికట్ల నరసింహారావు భూమి; దక్షిణం: నన్నపనేని సంజీవమ్మ భూమి; పడమర: గుండవరపు లక్ష్మీ నారాయణ భూమి; ఉత్తరము: జంపని కొండయ్య భూమి.

D.H.R. Value Rs. 4,500

Amin Value Rs. 40,000/-

వేలము వాయిదా : 8.2.93

Further Hearing: 16.2.93

వి. రంగశాయి

DHr Advocate

## పినాకిని తీరం

(2 పేజీ తరువాత)

వాతావరణం గందరగోళంగా వుంది; ప్రతిపక్షాలు ఎన్నికలంటే ఏకమవు తాయి; కాంగ్రెస్‌లో విలువగా ద్వంగా, వ్యక్తుల పరంగా, వివాల వారీగా చీలికలున్నాయి. పార్టీ ప్రాతిపదిక హైకాకుండా వుంటె ఈ క్షణంలో జరిపినా నష్టం లేదు; పార్టీ టిక్కెట్లతో జరపదలిస్తే మాత్రం కాంగ్రెస్ తన ఇంటిని చక్కదిద్దుకొని, కార్యోన్ముఖం కావడానికి తొందర పడాలి!

నెల్లూరుకు సంబంధించినంత వరకు పరిస్థితి ఇదీ–

తెలుగుదేశం అంచనా వేసుకోబోతుంది – స్వతంత్రంగా గెల్చే అవకాశముందా లేదా అని. వుందంటే మాత్రం లెఫ్ట్ మిత్రులుగాని, మరెవరైనా గాని, అందరికి బైబైబైలే; అవకాశం లేదనుకుంటె మాత్రం ప్రతిపక్ష ఫ్రంటు ఏర్పాటుకు మొదటి పిలుపు ఆ పార్టీది గానే వుంటుంది. తెలుగుదేశం వైఖరి ఎట్లున్నా కమ్యూనిస్టు పార్టీలు ఒక ఫ్రంటును ఏర్పాటు చేసుకొని మునిసిపల్ ఎన్నికలలో పోటీ చేయడం నెల్లూరులో అనాదిగా వస్తున్న సాంప్రదాయం. ఈసారి బి.జె.పి. స్వతంత్రంగా పోటీ చేయబోతు..ది. ఇక కాంగ్రెస్ – దాని విషయం స్పష్టమైన అవగాహన ఏర్పడటం లేదు. అందరూ ఏకత్రాటి మీద నిలుస్తారా. ఎవరికి వారే అవుతారా అనేది తేలవలసి వుంది. నాయకుడు జనార్ధన రెడ్డి పార్టీ టిక్కెట్ల పద్ధతి వుంటె అభ్యర్థుల నిర్ణయం ఆయనదిగానే వుంటుంది. నిర్ణయం ఆయనదే అయినా స్థానికంగా ఎవరి మీద ఆధార పడుతాడో? మునిసిపల్ ఎన్నికలలో ఆయనకు విశ్వాస పాత్రుడైన వ్యక్తి ఎవరు? ఎన్నికల నిర్వహణ భారాన్ని సమర్థంగా మోయగలవాడెవరు? మాకెవ్వరూ కనపడటం లేదు. దీన్ని గూర్చి ఆయన ఇప్పటి వరకు ఆలోచించకుండా వుంటాడని, ఒక నిర్ణయానికి రాకుండా వుంటాడని అనుకునే అవివేకి వుండడు. అయితే సమయం వచ్చే వరకు నిబ్బరంగా, ధీమాగా, పట్టీ పట్టనట్లు వుంటాడు; సమయానికి పెట్టెలు దించుతాడు! అదీ ఆయన కార్యసరళి.

జనార్ధన రెడ్డి నాయకత్వాన్ని, ఆయన నిర్ణయించే అభ్యర్థులని కాంగ్రెస్ వాదులందరూ సమర్థిస్తారా? సందేహమే. సింహపురి సేవా సమితి వుంది. అది జాయింటు పట్టా. ఎవరైనా వుపయోగించుకునే హక్కు అధికారాలున్నాయి. శాసనసభ్యుడు వుపయోగించు కునేట్లుంటె ఆ బ్యానర్ క్రింద ఎవరెవరు చేరుతారు? కె.వి. ఎవరితోనైనా ఇమడగలడా? కోటంరెడ్డి సోదరులకు ఇటువంటి ఎన్నికలలో స్వంత పరపతి వుందా? జనార్ధన రెడ్డి వ్యతిరేకులమనుకునే వారంద ఒకే వేదిక మీద సమైక్యమయ్యే అవకాశముందా? కాంగ్రెస్ వాళ్ల సంగతి ఎవరు చెప్పగలరు మహానుభావా!

అసలు ఛేర్మెన్ ఎన్నిక ప్రత్యక్షమా, పరోక్షమా? ముందు తేలవలసిన సమస్య ఇది. నా వూహ చెప్తుంది – ఛేర్మెన్ పదవి ప్రత్యక్ష ఎన్నిక గాని పరోక్ష ఎన్నిక గాని, నెల్లూరు జిల్లా పరిషత్తు ఛేర్మెన్ పదవికి, ఒంగోలు పార్లమెంటు అభ్యర్థిత్వాల వలె సమవుజ్జీయే కాదు. అనమానుడైన ఒక వ్యక్తి, అజేయుడు, అభేద్యుడు కాంగ్రెస్ వారందరూ కిం అనకుండదమే కాదు, ప్రతిపక్షాలలోని ముఖ్యులలో కొందరిని సైతం ఆలోచనలో పెట్టగల ఆకర్షించ గల కనీసం తటస్థం చేయగల బలమైన వివాద రహితుడైన అభ్యర్థి ఎవరైనా మోపింప బడబోతాడేమో అనిపిస్తుంది. ఈ విధంగా నెల్లూరు మునిసిపల్ ఎన్నికల వ్యవహారం శ్రమలేకుండా, తల పగులగొట్టు కోకుండా, బరువు బాధ్యతలు మోయవలసిన అవసరం లేకుండా సూక్ష్మంలో మోక్షంగా పరిష్కరింపబడ బోతుందా ననిపిస్తుంది. నా ఈ వూహా గానం ఆధారం లేనిది, భూత వర్తమాన రాజకీయ పోకడలను, అనుభవాన్ని పరిగణనకు తీసుకొని వూహిస్తున్నది. రాజకీయాల్లో క్షణక్షణం అనుక్షణం మార్పులుండ వచ్చు. అందువల్ల దీన్ని గట్టిగా పట్టుకో వద్దని మనవి.

ఎవరా ఆగంతక అభ్యర్థి అంటారా? - ఇంకా బాగుంది! నా చెవికి రానివ్వండి. మీ అందరి చెవినా వేస్తాను !

(signature)

## కలెక్టర్ మాటల్లో

(4 పేజీ తరువాత)

చెప్పుస్తున్నారని చెప్పారు. ప్రజలకుపయోగపడే సంస్థ ఇది. ఆర్టీసి ఈ ఏడాది కొత్తగా దక్కిలి, బుచ్చి, పొదలకూరు, ఉదయగిరిలో బస్‌స్టేషన్లు, డిపోలు కట్టనున్నది. డిఆర్‌డిఎ క్రింద 9005 కుటుంబాలకు సహాయం చేశారు. ఎస్‌సి కార్పొరేషన్ ద్వారా 10 కోట్లతో 8వేల ఎకరాల భూమి సాగులోకి తేనున్నారు. చల్లాయానాదులకు 65 లక్షలు ఖర్చుపెడుతున్నారు. బిసి కార్పొరేషన్ క్రింద మాత్రం కేవలం 14లక్షలు వెచ్చిస్తున్నారు. అక్షరాస్యతా కార్యక్రమం క్రింద రెండున్నర లక్షల మందికి చదువు నేర్పినట్లు చెప్పారు. కలెక్టర్ గారి ప్రసంగంలో ఇటువంటి లెక్కపక్కలు విస్తారంగా వున్నాయి.

ఈ సారి రిపబ్లిక్ డే ఉత్సవంలో, పెరేడ్ మైదానంలోనే ఒక నృత్యరూపకం , పిల్లల చేత కార్యక్రమాలు నిర్వహించారు. షరామామూలుగా ప్రశంసా పత్రాల బహూకరణ జరిగింది. అదొక కొండవీటి చాంతాడంత జాబితా. దాన్ని ఎవరు ఏ ప్రాతిపదికపై తయారుచేసి, ప్రశంసకు అర్హతలు, నిర్ణయిస్తారో తెలియదు కాని, వాటిపట్ల అవి తీసుకొనే వారిలోనే గౌరవభావం లేదు;ప్రజలకు ఇంకా చులకన. విజిలెన్స్ సిఐగా సిఐ శ్రీ రజబలిని సత్కరించడమొక్కటె ఈ ఏడాది సముచిత ఎంపికన్పించింది. అతనొక్కడూ ప్రాణాలకు, ఒత్తిళ్లకు, ప్రలోభాలకు తెగించి ఒంటరిగా మాంబట్టు గ్రామంపై దాడిచేసి 7 లారీలు పట్టుకొని , సెభాష్ అన్పించుకున్నాడు. తత గర్గపై దాడులంటే ఆషామాషీ వ్యవహారం కాదు గదా!

### పిఎంఆర్ స్కూలు

టౌన్‌లోని రంగనాయకుల పేట పి. ఎమ్.ఆర్.ఎమ్. హై స్కూల్ నందు రిపబ్లిక్ దినోత్సవ వేడుకలు ప్రధానోపాధ్యాయులు వై. శ్రీనివాస రావు అధ్యక్షన ఘనంగా జరిగాయి. పాఠశాల పూర్వపు విద్యార్థులు ఎం. నారాయణాచార్యులు, రొటేరియన్, పొమ్మిన సుబ్రహ్మణ్యం ముఖ్య అతిథులుగా పాల్గొని పతాకావిష్కరణ చేశారు. వివిధ క్రీడల్లో గెలుపొందిన బాలబాలికలకు బహుమతులందజేశారు.

### శారదాస్కూలు

స్టోన్‌హౌస్ పేటలోని శారద ఇంగ్లీష్ మీడియం హై స్కూల్ విద్యార్థినీ, విద్యార్థులు వినూత్న పద్ధతిలో రిపబ్లిక్ దినోత్సవాన్ని జరుపుకున్నారు. వివిధ సాంస్కృతిక నృత్య భంగిమలను ప్రదర్శిస్తూ టౌన్‌లోకి ప్రదర్శనగా బయలుదేరి ప్రముఖ కూడలిలో జాతీయ పతాకావిష్కరణ చేశారు. జాతీయ సమైక్యత, సౌభ్రాతృత్వం ఆవశ్యకతను చాటుతూ ప్రధానోపాధ్యాయుడు ఉపన్యసించారు.

## పి వి అండ్ సన్స్

(2 పేజీ తరువాత)

బహిరంగంగా మోటుకోవాలని భావిస్తున్నారట. త్వరలో జరుగనున్న రాష్ట్ర మంత్రివర్గ విస్తరణలో తమ వర్గీయులకు స్థానం దొరుకుతుందో లేదో వేచిచూసి దాన్ని బట్టి రాష్ట్రంలో కూడా తమనురించాల్సిన వ్యూహం

కేంద్ర మంత్రి పదవి దక్కుతుందని ఆశించి భంగపడిన వైఎస్ రాజశేఖర రెడ్డి ప్రధానమంత్రి రాష్ట్ర పర్యటనను బహిష్కరించి తన నిరసన వ్యక్తంచేశారు. ప్రధాని నగరానికి వచ్చే ముందే రాజశేఖరరెడ్డి నగరంలో లేకుండా ఉడాయించే సరికి ప్రధాని కార్యక్రమాల్లో పాల్గొనాలా? వద్దా? అని ఆయన వర్గీయులు తలలు పట్టుకోవాల్సి వచ్చింది. ప్రధాని పర్యటనలో తమ వ్యూహం ఏమిటో తెలీక రాజశేఖరరెడ్డి హార్దికోర్లు – మాజీ మంత్రులు రవీంద్ర రెడ్డి, సంగీతంవెంకటరెడ్డి పి.వి. స్వాగత కార్యక్రమానికి గైరు హాజరయ్యారు. ఆ తర్వాత వై.ఎస్. బెంగుళూరులో వున్న విషయం తెలుసుకొని ఆయనను సంప్రదించిన మీదట మరుసటి రోజున జరిగిన ఎమ్మెల్యేలు, ఎంపిల సమావేశానికి హాజరయ్యారు. ప్రధాని రాజధాని నుంచి వెళ్లిపోయాక వైఎస్. నగరానికి చేరుకున్నారు. వచ్చీ రావడంతోనే తన హార్దికోర్లతో కలిసి నిమ్స్‌లో చికిత్స పొందుతున్న మాజీ మంత్రి నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డిని పరామర్శించారు.

ఖరారు చేసుకోవాలని అనుకుంటున్నారు. ఏప్రెల్‌లో రాష్ట్రంలో జరుగనున్న రాయచోటి, పాణ్యం ఉప ఎన్నికల్లో" బలప్రదర్శనకు " వై.ఎస్. వర్గీయులు సమాయత్త మవుతున్నారు. మంత్రి వర్గ విస్తరణలో గనక వై.ఎస్.ను "సంతృప్తి" పరచక పోయినట్లయితే కోట్ల విజయభాస్కర రెడ్డికి కొత్త సమస్యలు తెచ్చిపెట్టవచ్చు.

## 50 ఏళ్ళ క్రితం

(3 పేజీ తరువాత)

రంధ్రాన్వేషి

జిల్లా కోఆపరేటివ్ బ్యాంక్.

మరలా బ్యాంక్ ప్రెసిడెంట్‌గా

## శివారెడ్డి పద్యాలు

### స్వర్గీయ దేవళ్ళ రామిరెడ్డి

మాట ఖచ్చితమ్ము మర్యాద నీ సొమ్ము
పేదసాదలంటె ప్రేమమెండు
అంతలోనెదివికి వెంచేస్తి దేవళ్ళ
రామిరెడ్డి! ఇంక రావు తిరిగి!

ఉంత దగ్గ వారు ఉంటుండిపోదగ్గ
వారు బోతె ఎవరు పగవ బళ్ళ
నీతి నిప్పవరులు నీలాంటి ఔదార్య
ఖనులు రాలిపోతె కలదెదిక్కు!

### నల్లపరెడ్డి శ్రీనివాసులరెడ్డి

విన్న నిన్ను గూర్చి విచ్చేసినావన్న
వార్త లేగ్నపాదు, వళ్లు జబ్బు
అయ్యె నల్లపరెడ్డి ఆ కారణం చేత
కవి శివారెడ్డి తమ్ము కల్పుకోల!

ఎవరు కాంగిరేసో, ఎవరు కమ్యూనిస్టో
ఇంతకెవరు భారతీయ జనతో
ప్రాయమెళ్లినాక పల్లూడిపోయాక
పాలిటిక్సు ఇంక పనికిరాదు!

### మటను ఎగ్గు దింటె

ఉండిండి కవులు వుడిగి పోతున్నారె
ఏమి కారణమ్ము ఎందువలన
మటను ఎగ్గు దింటె మరికాస్త పై కొస్తా
కాయగూరలు దింటె తరిగి పోత!

కవిని చేపలంటె కళ్లద్దుకుంటాను
పిట్టమాంసమంటె పిచ్చి జాస్తి
ఆ దినాలు వేరు, ఆ రెండు వదిలేస
ఇష్టం లేక కాదు వీలు లేక

### వైరాగ్యం

తప్పుదారిన బోయె తంటాలుబడతుంద
మరణకాలమందు మంచమెక్కి
నలిగి చావకుండా నా తెప్పకడతేర్పు
ఎర్రెమడ్డేకవిని వర్దు జేర్పు

మిత్రుడు దేబాల దశయ్యగారు వచ్చినందుకు అభివందనాలు. ఇది క్రానిక్ మలేరియా జ్వరం మాదిరి వచ్చిపో వడమే!బ్యాంకు పుట్టిన తర్వాత ఇంత నీరసమైన ఎగ్జిక్యూటివ్ ఏర్ప డలేదని వూళ్లో అంటారు. ఇక దశరథరామిరెడ్డిగారి కత్తి వెన్నలో తిరిగినట్లే!లక్ష్మీనరసారెడ్డి గారు పేరు పొడుగుగా వుంటె ఏమో అనుకో.. స్పోర్సును వరించినట్లున్నది.

దశరథరామిరెడ్డిగారికి బ్యాం కు విషయంలో మంచి అనుభవం వున్నది. అప్పుడప్పుడు సహజమైన మెత్తదనం చూపినా కరుకుగానే పనిచేశారు అనాల. ఇక యిప్పుడు బ్యాంకు మంచి ప్రయత్నాన్ని విధానాన్ని అభిలషిస్తున్నది.

కొత్త అధికార సెక్రటరీ బ్యాంకును బాగుచేయలేక పోయినా ఇూవెస్టుమెంటు కూడా సరిగా చేయలేదనాల. బ్యాంకుకు కొన్ని లక్షలు మిగిలి నిద్రపోతున్నవి. లాభం లేదు- సర్దిపాలించడం . ప్రెసిడెంటు భుజాలమీద పడింది. కార్యదక్షుడు -పూనితే సాగించగలడు.

ఎం.వి. నరసింహారావు గారు వైస్ ప్రెసిడెంటుగా వచ్చి అర్బన్‌బ్యాంకు విచారణ ఆపించుకొనే ప్రయత్నం చేస్తాడేమో!లొంగబాకంగి

### వి.ఆర్.కాలేజి కమిటీ:

కాలేజి కమిటీ ఎన్నికలు జరిగి 5 ఏండ్లు ఐంది- యీ మే నెలలో తిరిగి ఎన్నికలు జరగాల. దానికి నోటీసు యిప్పటికే వచ్చివుండాల. రానందునను-వూళ్లో పుకారువల్లను పాతకమిటీనే సాగించాల అని వున్నట్లు తెలుస్తున్నది. కమిటీ సర్వాధికారి అనే నిబంధన శరణ్యంతో ఎన్నికలు జరుపకుంటె అన్యాయం అనవలసి వుంటుంది. ప్రభుత్వం అన్నట్లు యుద్ధపరిస్థితుల ఆశ్రయించి కమిటీని పొడిగిస్తే అంటువ్యాధి అనక తప్పదు. కొన్ని బోర్డులను నామినేటు చేసినట్లే మీరూ చేయండి ఎన్నికలకు భయపడితే!

### మహోత్సవఆహ్వానపత్రికలు:

ఏ శుభకార్యానికిగాని పిలుపు జాబులను, వివాహ- గర్భదాన- గృహ ప్రవేశ-మహోత్సవ ఆహ్వానపత్రిక అనడం మన సాంప్ర దాయమై పోయినట్లున్నది- అన్నం పెట్టకుండా-వూరేగింపులు లేకుండా దేవళంలో జరిగే హూరాహూరి పెండ్లిగూడా మహోత్సవం పద్దుక్రిందకే జమ. దొంగపెండ్లి సంగ తటుండనియండి.

దీని ననుసరించే కాబోలు ఎ.ఎఫ్.కృష్ణమూర్తి- వెంకట్రామ య్యగార్ల ఉమ్మడి ఉత్పత్తి రుద్రమదేవి నాటక పఠనం కూడా మహోత్సవం క్రిందనే ఆహ్వానాలు పంపబడినవి.

## పంచాంగము

తేది 30 శనివారము రథసప్తమి
తేది 3 బుధవారము భీష్మ ఏకాదశి

### ముహూర్తములు

తేది 3 ఏకాదశి బుధవారము ఉదయము 9.20 గంటలకు మీన లగ్నమున గృహారంభ, వ్యాపారారంభ ఉపనయన వివాహములకు

తేది4 త్రయోదశి గురువారము రాత్రి 9.10 గంటలకు కన్యాలగ్నమున వివాహములకు

తేది 5 త్రయోదశి శుక్రవారము రాత్రి 9.06 గంటలకు మీన లగ్నమున వ్యాపారారంభ ఉపనయన వివాహ ములకు సుముహూర్తములు కలవు.

### జనవరి తిథులు

మాఘశుద్ధ

తే 30 శని సప్తమి ప.గ. 12.05 వ
తే 31 ఆది అష్టమి ప.గ. 12.43 వ

ఫిబ్రవరి తిథులు

తే 1 సోమ నవమి ప.గ. 1.10 వ
తే 2 మంగళ దశమి ప.గ. 12.45 వ
తే 3 బుధ ఏకాదశి ప.గ. 12.28 వ
తే 4 గురు ద్వాదశి ప.గ. 11.26 వ
తే 5 శుక్ర త్రయోదశి ఉ.గ. 10.00 వ

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఎ

# 'ఖుష్బూంబిక'కు పాలరాయి విగ్రహం

"కలియుగ పాండవులు" చిత్రంలో నటించిన ఖుష్బూ నేడు తమిళంలో బిజీ హీరోయిన్. ప్రముఖ తమిళ హీరోలందరి సరసన నటించి, అచిర కాలంలోనే అసంఖ్యాక అభిమానులను సంపాదించుకో గల్గింది. ఆమె పేరున తిరుచ్చి విమానాశ్రయం సమీపంగా ఉన్న బర్మా కాలనీలో "ఖుష్బూంబికా ఆలయం" అనే గుడిని ఓ వెర్రి అభిమాని నిర్మించారు. దీపావళి

## ఏమిటో వెర్రి

నాడు ప్రారంభోత్సవం జరిగిన ఈ కోవెలలో ప్రతి రోజూ పాలరాతి ఖుష్బూ విగ్రహానికి పూజలు జరిపించే ఏర్పాట్లు కూడా చేశారు. ఒక ముస్లిమ్ వనితకు ఈ రోజుల్లో ఇంతగా ఆరాధన జరగడం సర్వమత సామరస్యానికి నిదర్శనమా? మధుర లోని ఒక అభిమాన సంఘం వారు "కాబోయే తమిళనాడు ముఖ్యమంత్రి" అంటూ ఆమె గురించి కొన్ని కరపత్రాలు కూడా అచ్చు వేయించారు; అభిమానానికి హద్దు ఉండాలి కదా!

## ముత్యాల దర్శకత్వంలో సురేష్

రవీంద్రా మూవీస్ చిత్రంలో సురేష్, రంభ, ఊర్వశి శారద, చంద్రమోహన్, కోట శ్రీనివాస రావు, సుధాకర్, వేలు, నర్రా, చలపతిరావు ప్రభృత నటవర్గం. సంగీతం: రాజ్–కోటి. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: ముత్యాల సుబ్బయ్య. ఈ చిత్రానికి ఒక విజయవంతమైన మలయాళ చిత్రం ఆధారం.

## నాగార్జున పరామర్శ

నిర్మాత డి. రామానాయుడు కుమార్తెకు నాగార్జున విడాకులిచ్చి కొంతకాలంగా దూరంగా ఉంటున్నారు. జనవరి 10 న అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో పాల్గొని తిరిగివచ్చే సమయంలో, రామానాయుడు ఢిల్లీ ఇందిరా గాంధీ అంతర్జాతీయ విమానాశ్రయంలో ఘోర ప్రమాదానికి లోనైన విమానం నుండి మృత్యుంజయుడుగా బయటపడ్డారు. ఈ సందర్భంగా తన మాజీ మామగార్ని చాలాకాలం తర్వాత హీరో నాగార్జున కలిసి, పరామర్శించి వచ్చారు. నాగార్జున త్వరలో తండ్రి కాబోతున్నారు. ఇప్పుడు అమల గర్భవతి.

## ఐ.ఎ.ఎస్. ఆఫీసర్‌గా అక్కినేని

శరత్ దర్శకత్వం వహించే శ్రీ సాయి ప్రసన్న కంబైన్స్ చిత్రంలో ఎ.ఎన్.ఆర్, వినోద్ కుమార్, సుహాసిని, రవీనా టాండన్, సత్యనారాయణ, సూతన్ ప్రసాద్, అల్లు రామలింగయ్య, కోట శ్రీనివాస రావు, బాబూ మోహన్, అంజలి, వై. విజయ, కల్పనారాయ్, సుధారాణి, సూర్యకాంతం నటిస్తున్నారు. కథ: కొమ్మనాపల్లి గణపతిరావు. మాటలు: పరుచూరి సోదరులు. సంగీతం: రాజ్–కోటి.

## 'రోగ్ నెంబర్ - 1, సెంట్రల్ రౌడీ'

జయప్రద సోదరుడు శ్రీ రాంకుమార్ స్వీయ దర్శకత్వంలో నటించి రూపొందించి చాలా తక్కువ కేంద్రాలలో విడుదల చేయించ గల్గిన చిత్రం 'ఎస్.పి. తేజ' 1992 లో ఫ్లాప్ చిత్రాలలో అగ్రస్థానం వహిస్తుంది. దాదాపు 50 లక్షల వరకు నష్టం వాటిల్లినట్లు ఆయనే చెప్పుకున్నారు. అదే కాక ఇంత వరకు ఫైనాన్సింగ్, ఇతర లావాదేవీల మూలంగా మొత్తం కోటి రూపాయల దాకా పోగొట్టుకున్నట్లు కూడా బాధపడ్డాడు. ఆ పోయిన డబ్బంతా రాబట్టుకోవడానికి 'రోగ్ నెంబర్ - 1, సెంట్రల్ రౌడీ' అనే రెండు చిత్రాలను ఈ క్రొత్త సంవత్సరంలో నిర్మిస్తారట!

మద్రాసు సినిమా వార్తలు

మా విలేఖరి



జీవితమే ఒక సినిమాలో వరుణ్‌రాజ్, అంజు

## భారీ చిత్రాలు బోల్తా కొట్టాయి!

ఈ సంవత్సరారంభంలో విడుదలైన "అశ్వమేధం" (బాలకృష్ణ–కె. రాఘవేంద్ర రావు); ఆ తర్వాత విడుదలైన "ముఠామేస్త్రి (చిరంజీవి - ఎ. కోదండరామిరెడ్డి) చిత్రాలు ఎంత నిరాశ గొల్పాయో అందరికీ తెలిసిందే. అలాంటి భారీ చిత్రాల వంక కొనుగోలు దారుల దృష్టి అంతకంతకు సన్నగిల్లుతుంది. నిర్మాతలూ భారీ చిత్రాలకు ఇది వరకటి లెవెల్‌లో ఆదరణ లభిస్తుందన్న నమ్మకాన్ని కోల్పోతున్నా, కొత్త చిత్రాలకు ప్రారంభోత్సవం చేయడం మాత్రం మానలేదు. "ప్రస్తుత పరిస్థితుల్లో సినిమాలు తీస్తే నిర్మాత బతికి బట్టకట్టలేడు. నిర్మాణ వ్యయం కోట్లు దాటి కొండెక్కి కూర్చుంది పెట్టుబడి సొమ్ము తిరిగొస్తుందనే నమ్మకం ఉండడం లేదు.

## అయినా బుద్ధి మారదు!

హాస్యం పేరుతో ద్వంద్వార్థాల బూతు చిత్రాలు కూడా ప్రేక్షకులకు వెగటు కల్గిస్తున్నాయి, అని పాత్రికేయుల ఎదుట బాధపడ్డ ఓ నిర్మాత, ఆ మర్నాడే రెండు కొత్త చిత్రాలను ప్రారంభించ బోతున్నట్లు తెలిపారు. ఎందుకయ్యా అని అడిగితే "మేం ఈ వృత్తికి అలవాటు పడ్డాం. మరే వాణిజ్య రంగంలోనూ రాణించలేము. అందుకే బ్రతుకు తెరువు కోసం కొత్త చిత్రాలు ప్రారంభించక తప్పడంలేదు" అన్నారు. ఏమిటో ఈ హిపోక్రసీ? సంక్రాంతి నాడు నాలుగు చిత్రాలకు ప్రారంభోత్సవాలు జరిగాయి.

## పాత నటి సినిమా వ్యామోహం

విదేశాలలో విద్యనభ్యసించి నందువల్లనేమో - నటి రాధిక వాక్చాతుర్యం అమోఘం. ఆమె కొంత కాలం సినిమా రంగానికి దూరమై వివాహం చేసుకుని ఒక బిడ్డ తల్లి అయ్యాక మళ్లీ సినిమాలలో ఛాన్సులకు ప్రయత్నిస్తోంది "ఎందుకు మళ్లీ సినిమాలు?" అని ఒక పాత్రికేయుడు అడిగితే "ప్రమాతి వ్యామోహంలో తెరమరుగయ్యాను మళ్లీ సినిమా వ్యామోహంలో పడ్డాను; మాలాంటి వారికి ఇది సహజమేగా? అయినా, నన్ను చూస్తే ఒక బిడ్డ తల్లిలా కనిపిస్తున్నానా?" అని ఎదురుప్రశ్న వేసింది.

## కాపీకి ఛాన్సు దొరకలేదు!

ఇటీవల ఢిల్లీలో జరిగిన 24వ భారత అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలకు హాజరై వచ్చిన సినీ ప్రముఖులందరూ అసంతృప్తితో నిట్టూర్పులు విడిచారు. కాపీ కొట్టడానికి అనువైన కథ గాని, సన్నివేశాలు గాని కానరాలేదట; అనవసరంగా డబ్బు టైము వృధా అయ్యాయని వాపోయారు. ఈ సారి ఈ ఉత్సవ నిర్వహణకు కేంద్ర ప్రభుత్వం ఒకటింబావు కోట్ల రూపాయలకు పైగా వెచ్చించింది. 1965లో ఈ ఉత్సవాలకు పది లక్షలు మించి వ్యయమవలేదు. కేన్స్, బెర్లిన్, లెనిన్ చిత్రోత్సవాలకు అక్కడి మునిసిపల్ సంస్థలు, వాణిజ్య సంస్థలే నిధులు సమకూరుస్తాయి.

### కొత్త దర్శకుని పాత పాట

సుమన్ సరసన శోభన, నగ్మా నాయికలుగా నటించే "రెండిళ్ల పూజారి" చిత్రానికి దర్శకత్వం వహిస్తున్న టి. ప్రభాకర్ ఎవరి వద్దా దర్శకత్వ శాఖలో సహాయకుడుగా తర్ఫీదు పొందకుండానే ఈ చిత్రానికి ఏకదమ్మున దర్శకుడై పోయాడు. కాని, ఇతను కూడా ఇతర దర్శకులలాగే "నేను కథను అనుకున్న రీతిలోనే చక్కగా తీయగల్గుతున్నాను.. చిత్రం చాలా సూపర్బ్‌గా వస్తోంది." వంటి ఊకదంపుడు వివరాలను ప్రెస్ మీట్‌లో చెప్పడం; వాటిని అలాగే సినిమా వార పత్రికల రిపోర్టర్లు రాయడం ఎబ్బెట్టుగా కనిపిస్తోంది. ఈ విలేఖరులకు కూడా ప్రతి సంచికలోనూ ఒకే రీతిన పదే పదే రాయడం విసుగనిపించదా?

## ముఠామేస్త్రి చిరంజీవి భవిష్యత్‌కు సూచనా?

మెగాస్టార్ చిరంజీవి నటించిన "ముఠా మేస్త్రి"ఫక్తు మాస్ మసాలా చిత్రం అనుకొంటే పప్పులో కాలేసి నట్లే. ఒకింత ఆలోచిస్తే అందులో చాలా రాజకీయ మర్మాలు ప్రతిఫలిస్తున్నాయి. చిత్రం ద్వితీయార్థంలో అక్కడక్కడా, చివరి సీన్‌లో ప్రత్యేకంగా హీరో వల్లించిన డైలాగులు ఇటీవల వెలువడుతున్న వార్తలు నిజమేనేమో నన్పిస్తూ ఆయన రాజకీయ రంగ ప్రవేశ ఆకాంక్షకు 'ఆరంగ్రేటం' లా కన్పిస్తున్నాయి. చిత్రం ప్రథమార్థంలో లుంగీ విప్పి మరీ డాన్స్ చేస్తూ, నెల్లూరు యానాదుల మాండలికంలో 'జింగులక జింగులక' అంటూ మాస్‌కు హుషారెక్కించే విధంగా నటించిన హీరో, ద్వితీయార్థంలో రాష్ట్రంలోని కుళ్లు, కుతంత్ర రాజకీయాలను డైనమిక్ లెవల్‌లో ప్రక్షాళన చేసే అవతారమెత్తుతాడు. వాస్తవానికి దూరంగా వుండే పలు సన్నివేశాలను పక్కన పెడితే, హీరో 'చిరంజీవి' తనదైన బాణీలో చిత్రంలోని సీన్‌లన్నీ లాగించేశాడు. మార్కెట్‌లో మేస్త్రిగా తరువాత మంత్రిగా విభిన్న మనస్తత్వం గల క్యారెక్టర్లలో 'ఈజీ' నటన ప్రదర్శించడంతో పాటు ఒక పాటలో వెరైటీ స్టెప్స్ వేసాడు. వీటిని అటుంచితే కోదండరామిరెడ్డి అఘోరించిన దర్శక

చిత్రసమీక్ష

అల్లూరు రహీం

ప్రతిభను ఎత్తిచూపే సన్నివేశాలు కోకొల్లలు. మత తత్వపు మారణహోమాన్ని ఆపను వెళ్లే సెక్యులర్ హీరో కారు స్టార్ట్ చేసినపుడు కీ బోర్డు పై ఒక మతానికి సంబంధించిన దేవుళ్ల స్టిక్కర్లు స్పష్టంగా కనపడి ఆ సీన్ను బలహీన పరచాయి. జాతీయ జెండాలోని మూడు రంగులు మూడు మతాలకు చిహ్నాలంటూ పరుచూరి బ్రదర్స్ ఒకసరికొత్త అర్థంలేని వినాదాన్ని పలికించి లేనిపోని 'న్యూసెన్స్' సృష్టించారు. పలు సన్నివేశాల్లో కనపడే ముస్లిం పాత్రలు 'అజా' (ప్రార్థన పిలుపు), వినగానే ఎక్కడ పడితే అక్కడ నమాజ్ చేయడం చూపించిన దర్శకుడు తాను పెద్ద సమైక్యతా సన్నివేశాలకు ప్రాణం పోశానని భావించి వుండవచ్చు. కాని భారతదేశంలోని ఏ ముస్లిం కూడా నమాజ్ ముందు 'వుజూ' ( కాళ్లు, చేతులతో పాటు ముఖ భాగాలను నీళ్లతో శుభ్రపరుచుకోకుండా) నమాజ్ చేయరన్న ప్రాథమిక సూత్రం తెలియక పోవడం విడ్డూరమే. దానికి తోడు మరో పాత్రకు పవిత్రమైన 'ఏసు' అనే పేరు పెట్టి, అతడి చేత నానా ఛండాలం పనులు చేయించి, దానిని "కామెడీ" అని మనల్ని నమ్మించి, నవ్వించ యత్నించి, క్రైస్తవుల మనసులు గాయపరిచారు. నీతి నిజాయితీకి ప్రతిరూపమైన మంత్రిగా వుండే హీరో

కారా 11 పేజీలో

## సింహపురి

(4 పేజీ తరవ)

పెళ్ళున్నపైనా తాను 23 తేది రాత్రి కేంద్ర బొగ్గు గనుల శాఖా మంత్రికి నచ్చచెప్పి మాట్లాడటం వల్ల సమస్య పరిష్కారమైందన్నారు. జీగురుపాడు, మణుగూరు, రామగిరిలలో ఏర్పాటు చేస్తున్న ప్రాజెక్టుల వివరాలను మంత్రి వెల్లడించారు. నెల్లూరు ఎమ్మెల్యే కోరిక మేరకు టౌన్‌లోని డి.కె.డబ్ల్యు కళాశాల ప్రాంతంలో మరో సబ్‌స్టేషన్ మంజూరు చేసే విషయం పరిశీలిస్తానని రోశయ్య హామీ ఇచ్చారు. ఎమ్మెల్యే జె.కె.రెడ్డి పట్టణ ప్రజలు ఎదుర్కొంటున్న విద్యుత్ సమస్యలను వివరించారు. ఒంగోలు ఎమ్పీ శ్రీమాగుంట సుబ్బరామి రెడ్డి రాష్ట్రంలో విద్యుత్తు వుత్పత్తిని పెంచేందుకు కృషి చేయాలని కోరారు. మార్చి నెలాఖరు వరకు ఎలాంటి నిబంధనలు, కోత లేకుండా విద్యుత్ సరఫరా అయ్యేలా చేయ గలిగితే జిల్లా రైతాంగానికి మేలు జరుగుతుందని కలెక్టర్ ఎం. సాంబశివరావు మంత్రి దృష్టికి తీసుకొచ్చారు. ఆత్మకూరు ఎమ్మెల్యే డాక్టర్ బి. సుందర రామిరెడ్డి వుపన్యసిస్తూ కోపూరు థర్మల్ స్టేషన్ ఆధునీకరణలో మంత్రి సహాయ పడాలని కోరారు. ప్రభుత్వ విప్, సర్వేపల్లి శాసనసభ్యుడు సి.వి. శేషారెడ్డి, జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర, డి.ఆర్.డి.ఎ. ప్రాజెక్ట్ అధికారి ఆదిత్య నాథ్ దాస్ కూడా కార్యక్రమంలో పాల్గొన్నారు. అప్పటికే సంధ్యచీకట్లు అలముకోవడంతో మంత్రి హడావిడిగా ఆత్మకూరు బస్టాండ్ వద్దకు చేరుకొని పొట్టి శ్రీరాములు విగ్రహానికి పూలమాలలు వేసి, కన్యకాపరమేశ్వరి ఆలయం సందర్శించి, అనంతరం జిల్లా రైస్ కాన్వాసింగ్ ఏజెంట్స్ అసోసియేషన్ భవనాన్ని తన చేతులు మీదుగా ప్రారంభించారు. అక్కడి నుండి నవాబుపేటలోని టి.వి.ఎస్. మునిసిపల్ గరల్స్ హై స్కూల్‌కు చేరుకొనిఇటీవలే ఎన్నికైన ఆర్యవైశ్య సంఘం సభ్యులతో పాటు జిల్లాలలోని వివిధ వైశ్య సంఘాల ప్రతినిధుల స్వాగతం అందుకున్నారు. అనంతరం సంఘం అధ్యక్షుడు సి.హెచ్. వెంకటేశ్వర్లు ఆయన్ను ఘనంగా సన్మానించారు. వీరితో పాటు ఒంగోలు ఎమ్పీ మాగుంట సుబ్బరామి రెడ్డి, శాసనసభ్యులు జె.కె. రెడ్డి, సి.వి. శేషారెడ్డి, సుందర రామిరెడ్డిలు మంత్రికి దుశ్శాలువాలు కప్పారు. ఆర్యవైశ్య జాతి కోసం ఆత్మార్పణం జేసిన కన్యాకపరమేశ్వరి దేవి, పొట్టి శ్రీరాముల బాటలో వైశ్యులు నడవాలని శ్రీ రోశయ్య వుద్బోధించారు. ఆ తర్వాత మంత్రి ఒక వివాహానికి హాజరై తిరుగు ప్రయాణమయ్యారు.

### పక్కా గృహాలలో ఎమ్మెల్యేల కోటా రద్దు

గృహ నిర్మాణ సంస్థ నిర్మించే పక్కాగృహాల కేటాయింపులో శాసనసభ్యుల ప్రత్యేక కోటాలు ఇక మంచి వుండవని సంస్థ చీఫ్ ఇంజనీర్ శ్రీ ఎ.ఎస్. సురేష్ చెప్పారు. 23 తేది స్టెర్లింగ్ మీటింగ్ హాల్‌లో జరిగిన రాయలసీమ జిల్లాల గృహ నిర్మాణ, సంస్థల మేనేజర్ల ప్రాంతీయ సమావేశానంతరం విలేకరులతో మాట్లాడారు. ప్రభుత్వం నుండి వచ్చిన కొత్త వుత్తర్వుల మేరకు శాసనసభ్యుల కోటా రద్దు చేసారట. అయితే జిల్లా ఇన్‌ఛార్జ్ మంత్రులకు వున్న 30 శాతం, ముఖ్యమంత్రికి వున్న 20 శాతం కోటాలు కొనసాగుతాయి. శాసనసభ్యుల కోటా ఎత్తివేయడం వల్ల గృహాల కేటాయింపు విషయం జిల్లా అభివృద్ధి సమీక్షా మండలి సమావేశంలో చర్చించి నిర్ణయిస్తారట. ఈ ఆర్థిక సంవత్సరం రాష్ట్ర సంస్థ 2 లక్షల 20 వేల గృహాలను 180 కోట్ల రూపాయల ఖర్చుతో నిర్మించే ప్రణాళిక సిద్ధపరిచినట్లు చెప్పారు. తమ సంస్థ కట్టించిన కాలనీల్లో 20 వేల ఇళ్లు కనీస సౌకర్యాలు కల్పించక పోవడం వల్ల నిరుపయోగమైనాయని చెప్పారు. కాలనీల నిర్వహణకు ఏటా ప్రభుత్వం ఇస్తున్న 5 కోట్లు చాలక పోవడం వల్ల తాము కాలనీ అభివృద్ధికి, రోజ్‌గార్ నిధులు ఖర్చుపెట్టాలని సర్పంచులను కోరుతున్నా మన్నారు. గృహ నిర్మాణాలకు మంజూరు చేసిన రుణాల రికవరీ కూడా ఘోరంగా వుందని, ఇప్పటి వరకు 500 కోట్ల రూపాయలు లబ్ధిదారులకుఇస్తే, 10 శాతం కూడా వసూలు కాలేదని ఆవేదన వ్యక్తపరిచారు. సమావేశంలో రాష్ట్ర గృహనిర్మాణ సంస్థ ఛైర్మెన్ శాసనసభ్యుడు పట్రా ప్రకాశరావు జిల్లా గృహనిర్మాణ సంస్థ ఎం.డి. శ్రీమతి ఉదయలక్ష్మి కూడా పాల్గొన్నారు.

### నేతాజీ జయంతి

నేతాజీ జయంతి వేడుకలు 23 తేది టౌన్‌లో ఘనంగా జరిగాయి. జయంతిని పురస్కరించుకొని జరిగిన రూట్‌మార్చ్ ప్రజలను ఆకట్టుకుంది. 500 మంది పైగా విద్యార్థులు రూట్‌మార్చ్ చేస్తూ బోసు బొమ్మ వద్దకు చేరుకొని విగ్రహానికి పూలమాలలు వేసి, వందనాలు సమర్పించారు. కార్యక్రమంలో జిల్లా స్వాతంత్ర్య సమర యోధుల సంఘం అధ్యక్షుడు దేవదానం, మాజీ కౌన్సిలర్ నరసింహులు గౌడ్, నేతాజి పైలట్ స్కూల్ కరస్పాండెంట్ ఎం.వి. సుబ్బారెడ్డి తదితరులు పాల్గొన్నారు. పట్టణంలోని పలువురు నేతాజి విగ్రహాన్ని పూలమాలలతో ముంచెత్తారు.

### రైల్వేస్టేషన్‌కు సదుపాయాలు

ఇటీవల నెల్లూరులో జరిగిన రైల్వే సమీక్షా సలహా మండళ్ల సమావేశం సూచనల మేరకు రైల్వేస్టేషన్‌లో కొన్ని సౌకర్యాలు కల్పించారు. బ్రిటిష్ హయాం నుండి వున్న ఇనుప రేకు మంచి నీటి ట్యాంకు స్థానంలో కొత్త సిమెంట్ ట్యాంక్, ప్రయాణీకులు విశ్రాంతి తీసుకునే రిటైరింగు రూమ్‌తో పాటు ఒక వి.ఐ.పి. వెయిటింగ్ రూమ్ ఏర్పాటు చేశారు. స్టేషన్ శుభ్రత కోసం శానిటరీ మేస్త్రిని నియమించడంతో పాటు ఒకటవ నెంబరు ప్లాట్‌ఫారానికి కొత్త షెడ్డు, ప్రయాణీకులు కూర్చోవడానికి 25 సిమెంటు బల్లలు ఏర్పాటు చేసినట్లు సౌత్ సెంట్రల్ రైల్వే సలహా మండలి సభ్యులు శ్రీ హమ్మిన సుబ్రహ్మణ్యం తెలుపుతున్నారు.

### సామూహిక వ్రతాలు

భీష్మ ఏకాదశిని పురస్కరించుకొని ఫిబ్రవరి 3వ తేది ఉస్మాన్‌సాహెబ్‌పేటలోని శ్రీ కృష్ణ సత్యనారాయణ స్వామి దేవస్థానంలో సామూహిక సత్యనారాయణ స్వామి వ్రతాలు జరుగుతాయట. ఆసక్తి గల దంపతులు పూజలో పాల్గొన వచ్చుని దేవస్థానం పాలకవర్గం తెలుపుతున్నది.

### గోరుతో 5.25 కేజీలు మోసిన ఘనుడు

చేతితో బరువు పట్టుకొని నిలబడితేనే కొద్ది సేపటికి మనకు చెయ్యిపీకడం ఖాయం; అటువంటిది బొటన వేలి గోరుతో ఏకంగా 5.25 కిలో గ్రాముల రాయిని మోసి సాహసాన్ని ప్రదర్శించాడు కపాడిపాళెం యువకుడు మరియదాసు. రిపబ్లిక్ దినోత్సవాన్ని పురస్కరించుకొని ఫత్తేఖాన్ పేటలోని రామయ్యబడిలో విద్యార్థులు, వుపాధ్యాయులు పలువురి ప్రజల సమక్షంలో ఈ ప్రక్రియ ప్రదర్శించాడు. సంతపేటలో మంచాలు అల్లుకుంటూ జీవనాన్ని కొనసాగించే దాసు ఇంతకు ముందు 46 నిమిషాల్లో 1500 బస్కీలు తీయడంతో పాటు మొదటి ప్రయత్నంగా కుడిచేతి వేలి గోరుతో 5 కేజీల బరువు గల రాయిని ఎత్తిపట్టుకొని విజయం సాధించాడట. ఏదో ఒక రికార్డు స్థాపించాలన్న తపన గల ఇతను 5.25 కేజీల బరువును గోరుతో 46 సెకెండ్లు మోసాడు.

### మత సామరస్యం కోసం మానవహారం

దేశంలో మత సామరస్యం వర్ధిల్లాలని కోరుతూ రిపబ్లిక్ దినోత్సవం నాడు గాంధీబొమ్మ నుండి నెహ్రూ విగ్రహం వరకు మానవహారాన్ని సి.పి.ఎం. పార్టీ టౌన్ శాఖ ఏర్పాటు చేసింది. ఈ కార్యక్రమంలో వేయి మందికి పైగా స్త్రీ, పురుషులు చేతులు పట్టుకొని గంటకు పైగా నిలబడి సమైక్యతా నినాదాలు చేశారు. కార్యక్రమానికి ఆ పార్టీ జిల్లా కమిటీ సభ్యుడు ఎన్. కృష్ణయ్య, ఎన్. మురళీకృష్ణ నాయకత్వం వహించారు. అనంతరం గాంధీ బొమ్మ వద్ద బహిరంగ సభ నిర్వహించారు.

### ఇటలీ యువతి నృత్యప్రదర్శన

రిపబ్లిక్ దినోత్సవాన్ని పురస్కరించుకొని మంగళవారం సాయంత్రం కస్తూర్బా కళాక్షేత్రంలో ఇటలీ దేశీయురాలైన డాక్టర్ ఇలియానా సిటారిస్టి ప్రదర్శించిన నృత్య భంగిమలు ఆహూతులను అమితంతగా ఆకట్టుకొన్నాయి. రామాయణ, మహాభారత, భగవద్గీత ఇతిహాసాలను ఇతివృత్తంగా చేసుకొని ప్రదర్శించిన హావభావాలు ఆమెలోని జగద్విదిత నాట్యస్థాయికి దర్పణా లయ్యాయి. గీతా గోవిందంలోని రాక్షస సంహారం, శేష తల్పం, కాళీయ మర్దనం, రావణ సంహారం ప్రేక్షకులను సమ్మోహితులను చేశాయి. మరణానికి చేరువగా వున్న ఒక ముస్లిం భక్తుడు పూరీలోని జగన్నాథ స్వామిని సందర్శించి, తనలో ఐక్యం చేసుకోమని అభ్యర్థించే ఇతివృత్తంగా కొనసాగిన ఘట్టంలో ఇలియానా పద ఘట్టనలు అజరామరాలు. ప్రదర్శన అనంతరం డాక్టర్ ఇలియానాను మెమెంటోతో సత్కరిస్తూ భారతీయ సంస్కృతికి ఇలియానా ప్రతిబింబమని, ఆమె వర్ణనాతీతమని యు.పి. మాజీ గవర్నర్ డాక్టర్ బెజవాడ గోపాల్ రెడ్డి ప్రస్తుతించారు. జిల్లా సాంస్కృతిక మండలి, దక్షిణ ప్రాంతీయ సాంస్కృతిక కేంద్రం తంజావూరు సంయుక్తంగా నిర్వహించిన ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ శ్రీ ఎం. సాంబశివరావు, జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర, ఎమ్మెల్యే శ్రీ జె.కె. రెడ్డి, ఎస్.పి. శ్రీ టి. కృష్ణప్రసాద్ కూడా పాల్గొన్నారు. టౌన్‌లోని పల్లవి మ్యూజికల్స్ సంగీత విభావరి కార్యక్రమానంతరం కొత్త పౌరసంబంధ శాఖాధికారి శ్రీ టి. వేణుగోపాల్ వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.

## చిత్రసమీక్ష

(9 పేజీ తరవ)

తప్పనిసరి పరిస్థితుల్లో మంత్రిపదవికి రాజీనామా చేసి రౌడీ రూపం దాల్చి సర్కిల్ ఇన్స్‌పెక్టర్‌ను కొట్టను ప్రభుత్వ కారులో వెళ్లిన సన్నివేశం హీరో నీతి–నిజాయితీని ప్రశ్నించ వలసి వస్తుంది. ఇలాంటి సన్నివేశాలు ప్రస్తావిస్తూపోతే కోదండరామిరెడ్డికి కోపంరావచ్చు. స్వతహాగా మంచి డ్యాన్సర్ అయిన చిరంజీవి చేత ఎందుకనో డాన్సులు వేయించకుండా కెమెరా ట్రిక్స్ పాటలకు పెట్టిన ఘనత కోదండరామిరెడ్డికే దక్కింది. కథ మలుపుల కోసం నానా గందర గోళాన్ని దర్శకుడు చిత్రంలో సృష్టించాడు.

కథలోకి వెళితే కూరగాయల మార్కెట్ ముఠామేస్త్రి సుభాష్ చంద్రబోస్ (చిరంజీవి), కూరగాయల్లో పుచ్చులు ఏరివేసినట్లు సమాజంలో జరిగే అన్యాయాలను ఎదుర్కొంటూ ఎమ్మెల్యే సుందరయ్య (జె.వి. సోమయాజులు) అభిమానం పొందుతాడు. పలు వ్యాపారాలు చేసే ఆత్మా (శరత్ సక్సేనా) తన మనుషులకు బోస్ మార్కెట్ వ్యాపారంలో అడ్డ తగులు తుండడంతో మేయర్‌తో కుమ్మక్కై సిటీ నడిబొడ్డున వున్న మార్కెట్‌ను దూరంగా తరలించే ప్రయత్నాలను ప్రారంభిస్తాడు. దీనికి నిరసనగా ధర్నా ప్రారంభించిన బోస్ ను ఆత్మా ప్రోద్బలంతో సర్కిల్ ఇన్స్‌పెక్టర్ (మన్సూర్ అలీఖాన్) చావ గొట్టడాన్ని అటుగా పని పై వచ్చిన ముఖ్యమంత్రి (గుమ్మడి)చూసి మార్కెట్ తరలించే ప్రయత్నాలను నిలుపుతాడు. మార్కెట్ పునఃప్రారంభమైన సందర్భంగా జరిగే సభలో ఆత్మామనుషులు ఎమ్మెల్యే సుందరయ్యను నాటకీయంగా హత్యచేస్తారు. పోలీసులు ఆత్మకే మద్దతివ్వడంతో బోస్ ఏమీ చేయలేక పోతాడు. సుందరయ్య ఆకస్మిక మరణంతో ఖాళీ అయిన సీటుకు జరిగే ఉపఎన్నికల్లో సి.ఎం. వత్తిడి వల్ల బోస్ పోటీ చేసి గెలుస్తాడు. ఆ భారీ మెజారిటీకి మెచ్చిన సి.ఎం. అతన్ని కార్మిక, మత్స్యశాఖలతో కాబినెట్‌మంత్రిని చేస్తాడు. సమాజంలో అవినీతిని ఏరి పారెయ్యను ప్రత్యేక అధికారాలను సి.ఎం. నుండి పొందిన మంత్రి బోస్, స్పెషల్ టాస్క్ ఫోర్స్ సిబ్బందిని తుపాకులతో సహా తన వెనుక వేసుకొని వెళ్లి, పలు అవినీతి వ్యాపారాలకు రాష్ట్రంలో మూల పురుషుడైన ఆత్మాతోపాటు అతని వ్యాపారాలను మాయిస్తాడు. దీనితో చిర్రెత్తి పోయిన ఆత్మా, బోస్ నియోజక వర్గంలో మత కలహాలు సృష్టించడంతో పాటు అతని చెల్లెల్ని వ్యభిచారిగా శిక్ష మంత్రి పదవికి రాజీనామా చేసి ఆత్మాని, అతని గోడుగుని అంతమొందించి మళ్లీ ముఠామేస్త్రి అయిపోతాడు.

కోర్టులో మత మారణహోమానికి సాక్షి భూతంగా నిలబడే సన్నివేశాన్ని హీరో లాయర్ల ఎత్తులకు పై ఎత్తువేసి చిత్తుచేసి, నిరూపించడం బాగుంది. మత సమైక్యతకు ప్రతీకగా హిందూ–ముస్లిం శవాలను రెండు భుజాల పై మోయడం సమైక్యతకు ఆలంబన అయితే, మంత్రి కాగానే హీరో చిందులేయడం, వాటికి తోడు హిట్ అయిన 'రోజా' లోని జాతీయ పతాకాన్ని కాపాడడం వంటి కాపీ సన్నివేశం కూడా అదనంగా చోటు చేసుకుంది. బజ్జీల కొట్టు బుజ్జమ్మ (మీనా), సెక్రటరీ కల్పన (రోజా), పాత్రలు పాటల కోసం సృష్టించిన క్యారక్టర్లే. విలన్‌గా శరత్ సక్సేనా, దేశభక్తులుగా అల్లు రామలింగయ్య, గుమ్మడి తమ పాత్రలు ప్రతిభావంతంగా పోషించారు. పరచూరి బ్రదర్స్ మాటలు వివాదాస్పదమైతే వేటూరి రాసిన ఐదు పాటల్లో టైటిల్ సాంగ్, ఎంత ఘాటు ప్రేమయో, అంజనీ పుత్రుడా బాగున్నాయి. రాజ్–కోటి సంగీతం, ఎస్. గోపాల్ రెడ్డి కెమెరా ముచ్చట గొల్పాయి.

## పబ్లిక్ వీధులే

(4 పేజీ తరవ)

వెడల్పుగలవి. ఆ అడ్డవీధులు అటు ఇటు పార్కు గేట్లకు సూటిగా వుంటాయి. అంటే ఈ విధంగా వీధులను ఏర్పరచడంలో టవున్ ప్లానింగ్ వారి వుద్దేశ్యం ఒక వీధిని మరో వీధితో కలపడమే కాకుండా, అన్ని వీధుల వారికి పార్కు అందుబాటులో వుండాలనేదే! వారి సదుద్దేశం గంగలో కలసి పోయింది. ఆ అడ్డవీధులన్నిటినీ దురాక్రమణ చేసి ఇళ్లు కట్టేశారు. ఆ కాలనీలో అంకణం ఖరీదు పదివేల రూపాయలుండ వచ్చు. ప్రజల సౌకర్యార్థం ఏర్పరచిన వీధులు, అంత ఖరీదు చేసే స్థలాన్ని దానవిక్రయాది సర్వహక్కులు కలిగిన తమ సొంత స్థలంగా అనుభవిస్తున్నారు. వాళ్లను అడిగే వారు లేరు; వాళ్లను లేవదీయాలని ప్రయత్నించిన వారూ లేరు; మునిసిపాలిటీ చావకుండా బ్రతికి వుంటే ఇంత విచ్చల విడిగా, ధైర్యంగా ఆక్రమణలు జరగడానికి వీలు లేదు. బి.జె.పి. రాష్ట్ర మహానాయకుడు వెంకయ్య నాయుడు గారు వుండిన, మంత్రి పనల పెంచలయ్య గారు వుండేది ఆ కాలనీలోనే! ఈ పెద్దలు గాని, ఆ కాలనీ వాసులు గాని ఈ ఆక్రమణ విషయంలో నోరు మెదపకపోవడం దౌర్భాగ్యం. తమ కాలనీ సౌకర్యాన్ని, అందాన్ని పరిరక్షించు కోలేని కాలనీ వాసుల నిస్సహాయత సిగ్గు చేటుగా వుంది!

– ఇదీ ఆ జాబు సారాంశం. ఈ జాబులోని ఆరోపణ నిజమా కల్పితమా అని మా విలేఖరి విచారించాడు. అక్షరాలా నిజమని తేలింది. మునిసిపల్ కమీషనర్ గారు పరమ దండగ; స్పెషల్ అఫీసరుగా వున్న కలెక్టరు శ్రీ సాంబశివరావు గారైనా ఒకసారి ఆ ప్రదేశాన్ని చూచి, తగిన చర్య తీసుకో గలిగితే టవున్‌లో ఇతర చోట్ల దురాక్రమణ దారులకు కూడా కాస్త భయం వుంటుంది!

# శ్రీ తల్పగిరి రంగనాథస్వామి దేవస్థానం

రంగనాయకులపేట - నెల్లూరు

## బంగారు గరుడ వాహన పునర్నిర్మాణంలో తమ అమూల్య విరాళాల ద్వారా సహకరించిన భక్తులెందరో— వారందరికీ మా మనఃపూర్వక వందనాలు సమర్పిస్తున్నాము.

**మాగుంట సోదరుల ఉదార విరాళం లేకుంటే ఈ వాహన పునర్నిర్మాణం ఎప్పటికీ ఒక పగటి కలే! శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి, శ్రీ మాగుంట సుధాకర రెడ్డి, శ్రీ మాగుంట శ్రీనివాసుల రెడ్డి గార్లకు ఎన్ని రూపాల, ఎన్ని మాటల్లో కృతజ్ఞత చెప్పినా రుణం తీరదు!**

### ప్రధాన దాతలు

| | | | |
|---|---|---|---|
| శ్రీ సిద్దవరపు శివకుమార్ రెడ్డి | రూ. 20,000.00 | శ్రీ నాయుడు దశరధరామిరెడ్డి | రూ. 10,000.00 |
| శ్రీ జె.కె. రెడ్డి , M.L.A., నెల్లూరు | రూ. 10,044.00 | శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారిదేవస్థానము, | రూ. 5,000.00 |
| శ్రీ సిద్దవరపు చంద్రశేఖర రెడ్డి, | రూ. 10,000.00 | శ్రీ కన్యకాపరమేశ్వరి అమ్మవారి దేవస్థానము | రూ. 5,000.00 |

### వెయ్యిన్నూటపదహార్లిచ్చిన దాతలు

శ్రీ కె. కృష్ణమాచార్యులు, మదనపల్లి; శాంతి జ్యూయిలరీ, నెల్లూరు; డా. సి.వి. రాఘవన్, మద్రాసు; శ్రీ మురారిశెట్టి కోటయ్య, నెల్లూరు; శ్రీ ఆనమాల శెట్టి హరినారాయణ & బ్రదర్స్; శ్రీమతి మురారిశెట్టి ప్రమీలమ్మ; డా. వి.బి.ఎన్. ప్రసాదరావు, హైద్రబాదు; కుమారి మురారి శెట్టి వెంకటలక్ష్మి; శ్రీ గునుపాటి చెల్లపిళ్లై, అమెరికా; కీ.శే. పులిమి వెంకట కృష్ణారెడ్డి; శ్రీ జి. సత్యనారాయణ, అహమ్మదాబాదు; శ్రీమతి యరమాక కౌసల్యమ్మ, నెల్లూరు; శ్రీ పప్పు మధుసూదన్.

### నూటపదహార్లిచ్చిన దాతలు

ప్రియదర్శిని పబ్లిక్ స్కూల్, నెల్లూరు; శ్రీమతి కాళింగ జయలక్ష్మమ్మ, నెల్లూరు; శ్రీ తూము గోపాల కృష్ణదాసు, నెల్లూరు; శ్రీ తాతా పెద్దపాప, ఒంగోలు; శ్రీ కల్లం లక్ష్మి ప్రసన్న కుమారి, నెల్లూరు; శ్రీ వెన్నారెడ్డి చెంచురామిరెడ్డి, కలివెలపాళెం; శ్రీ కె.ఎస్. నరశింహా చారి, నెల్లూరు; శ్రీ కె. రంగస్వామి, నెల్లూరు; శ్రీ కె.టి. రామానుజాచార్యులు, నెల్లూరు; శ్రీ ఎన్. శ్రీనివాసా చార్యులు, నెల్లూరు; శ్రీ కె. జగన్నాథా చార్యులు, నెల్లూరు; శ్రీ బి. చక్రపాణి, నెల్లూరు; శ్రీమతి వేపూరి లక్ష్మి, నెల్లూరు; శ్రీ వాకాటి రామయ్యశెట్టి, నెల్లూరు; శ్రీ కె. గోపాల్ రెడ్డి, నెల్లూరు; శ్రీ ఇ. శేషాచార్యులు, నెల్లూరు; శ్రీ పి.బి. హనుమాన్, నెల్లూరు; శ్రీ ఇ. గోపాలాచార్యులు, రాజమండ్రి; అలంకార్ జ్యూలరీ, నెల్లూరు; శ్రీ జి. బాలసుబ్రహ్మణ్యం, నెల్లూరు; శ్రీ విఘ్నేశ్వరా పిక్చర్స్, నెల్లూరు; శ్రీమతి పోలా సరస్వతమ్మ, నెల్లూరు; శ్రీ కుచ్చెర్లపాటి సీతారామరాజా, నెల్లూరు; శ్రీ అద్దంకి రామతిలకమ్మ, నెల్లూరు; శ్రీమతి దుప్పూరు దేవసేనమ్మ, తరిగొండ; శ్రీ పెరంబదూరు ఆండాళమ్మ, విజయవాడ; శ్రీ కె.ఎస్. రామానుజాచార్యులు, నెల్లూరు; శ్రీమతి కె. గోదమ్మ, నెల్లూరు; శ్రీ చండి వెంకట సుబ్రహ్మణ్యం, నెల్లూరు; శ్రీ టంకశాల బదరీ నారాయణ, నెల్లూరు; నలగట్ల ఆదెమ్మ, ఐనమడుగు; శ్రీమతి చిల్లకూరు సరసమ్మ, నెల్లూరు; శ్రీ పి. శ్రీనివాసులు, నెల్లూరు; శ్రీ మెంటా మురళి, నెల్లూరు; శ్రీ టి. రాజేంద్ర ప్రసాద్, నెల్లూరు; శ్రీ డి. వెంకట రెడ్డి, నెల్లూరు; శ్రీ పి. సూర్యనారయణ శెట్టి, నెల్లూరు; శ్రీ ఎస్.ఎమ్. పెరుమాళ్, నెల్లూరు; శ్రీమతి గుర్రం మంగతాయారమ్మ, నెల్లూరు; శ్రీ పి. రాజకుమార్, నెల్లూరు; మనుబోలు పట్టాభిరామిరెడ్డి, పెద్దచెరుకూరు; బండా రాజేంద్ర ప్రసాద్ రెడ్డి, అన్నారెడ్డి పాళెం; అనమాలశెట్టి వెంకటేశ్వర్లు, నెల్లూరు; వెలంపల్లి వీర రాఘవులు, నెల్లూరు; శ్రీ కె.వి. శేషయ్య, నెల్లూరు; శ్రీ పి. జనార్దన రెడ్డి, నెల్లూరు; శ్రీమతి ఎమ్. గాయత్రి, నెల్లూరు; జయరాం బీడి ఫ్యాక్టరీ, నెల్లూరు; ఓ.ఆర్.డిస్టలరీస్ లిమిటెడ్, తిరుపతి; శ్రీ డి. నంద గోపాలరెడ్డి, నెల్లూరు; శ్రీ పి.వి.కె. రెడ్డి, నెల్లూరు; శ్రీ జి. రవీంద్రారెడ్డి, నెల్లూరు; శ్రీ డి. సుందర రామిరెడ్డి, [illegible]; శ్రీ ఎ. శ్రీరాములు, నెల్లూరు; శ్రీ బి. ధనలక్ష్మి, నెల్లూరు; ఏటూరు శేషయ్య, నెల్లూరు; పసుపులేటి శివరామయ్య, నెల్లూరు; తాటిపర్తి హజరత్తయ్య, నెల్లూరు; శ్రీమతి చట్లపల్లి సులోచన, నెల్లూరు; శ్రీ వై. కోటేశ్వర రావు, నెల్లూరు; శ్రీ పసుపులేటి భాస్కర రావు, నెల్లూరు; శ్రీ చెరుకుమూడి రామచంద్రయ్య, నెల్లూరు; శ్రీ ఐ. వెంకట సుబ్బయ్య, నెల్లూరు; వై. మస్తాన్ రావు, నెల్లూరు; ఆకులూరి సుబ్రమణ్యం, నెల్లూరు; రాయపల్లి దుర్గాప్రసాద్, నెల్లూరు; రాయపల్లి సునీత, నెల్లూరు; రాయపల్లి దామోదర రావు, నెల్లూరు; మనుబోలు పట్టాభిరామిరెడ్డి, నెల్లూరు; ఆకులూరి పాండురంగయ్య, నెల్లూరు; శ్రీ డి. రాఘవయ్య, నెల్లూరు; శ్రీ ఎస్. రామలింగయ్య, నెల్లూరు; శ్రీ ఎ.వి.ఎస్. శర్మగారు, నెల్లూరు; వై.వి. కృష్ణారెడ్డి, నెల్లూరు; ఈశ్వరమ్మ గారు, నెల్లూరు; శ్రీ జె. వామన రావు, నెల్లూరు; శ్రీమతి సుధాబాయి, బెంగుళూరు; గిరిమజి, బెంగుళూరు; శ్రీమతి నర్మదాబాయి, బెంగుళూరు; శ్రీమతి గిరి రావు, బెంగుళూరు.

జీర్ణోద్ధారణ చేసిన రంగనాయకి దేవి (మహాలక్ష్మి అమ్మవారు) గర్భగుడి విమాన గోపురం, బంగారు గరుడ వాహనాల సంప్రోక్షణ ఫిబ్రవరి **8** తేది జరుగుతుంది; **6.2.1993** నుంచి **3** రోజుల పాటు విశేష పూజలు, హోమాలు, నిర్వహిస్తున్నాము. భక్తులు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని మనవి.

### ధర్మకర్తల మండలి

నెల్లూరు డోలేంద్రప్రసాద్ (ఛైర్మన్), ఉడతా వెంకట్రావు, పులిమి దినకర రెడ్డి, పి. సురేష్ రెడ్డి,
తెలిమేటి చిన సుబ్బయ్య, చీదెళ్ల సుశీల, ఆలపాటి దశరథకుమారి; కె.ఎస్. నరసింహాచార్యులు (ఇ.ఒ)

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.